# సంభాజి నిర్యాణము

(మహారాష్ట్ర భాషనుంచి తెలిగించినది)

అనువాదకుడు:

మాచిరాజు దుర్గాశంకరామాత్యుడు

పరిష్కర్త:

శ్రీపాద కామేశ్వరరావు




ప్రకాశకుడు:

చెలుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్ర గ్రంథమాలాలయము

రాజమండ్రి

1931



* * *

వెల రూ 1-0-0

# పీఠిక

---

హిందూదేశమందలి ప్రజలలో రాజపుత్రులూ మహారాష్ట్రీయులున్నూ కడు ప్రసిద్ధికన్నవారు. ఛత్రపతి శ్రీశివాజీ మహారాజుపేరు ఎరుగని హిందువు లరుదు. అతనితరువాత శంభూజీ మహారాష్ట్రమునకు ప్రభువాయెను. ఇతడు తండ్రికి తగినకొడుకు కానందువల్ల రాష్ట్రప్రభ క్షీణించెను.

ఈసందర్భము నాధారముచేసుకొని శ్రీమాన్ విష్ణు ఔంధ్కర్ అను నటకుశలుడు "బేబంద్‌శాహి" (నిరర్గళపరిపాలన) అనే పేరున నాటకము వ్రాసెను. గద్యనాటకములలో ఇది సుప్రసిద్ధమని ఎరిగి 1929 సం॥రపు వేసవికాలమున మా మిత్రులు శ్రీమాన్ మాచిరాజు దుర్గాశంకరామాత్యునిచేత తెలుగున తర్జుమాచేయించినాము. ఆమహాశయుడు నిరుడు మార్చి నెలలో స్వర్గస్థుడౌటచేత ఆతని ఆత్మశాంతికై దీనిని ప్రచురిస్తూన్నాము.

20—2—31 చె॥ వే॥

# ఇందలి ముఖ్యపాత్రములు



## పురుషులు

| | | |
|---|---|---|
| శంభుజి | ... | మహారాష్ట్రప్రభువు |
| రాజారామ్ | ... | శంభుజి తమ్ముడు |
| సూర్యాజి పిసాళ్ | ... | సర్దారు |
| గణోజి శిర్కే | ... | శంభుజి బావ |
| కలుశాకబ్జి | ... | బ్రాహ్మణుడు (శంభు ఆశ్రితుడు.) |
| ఖండోజి<br>మాహీరు | ... | సర్దారులు |
| ఇక్లాస్‌ఖాన్ | ... | మొగలు సర్దారు |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| యేసూ (యశోదా) బాయి | ... | మహారాష్ట్రరాణి |
| తారాఊ | ... | రాజరామ్ భార్య |
| సంతూమాయి | ... | ఖండోజి చెల్లెలు |
| చంద్రావళి | ... | మాహీరు భార్య |




# మొదటి అంకము

## మొదటి రంగము.

రాయగడ దుర్గము—తారాబాయి, సూర్యాజీ.

తారా—సూర్యాజీ, ఛత్రపతులైన భోంసలావారి సంబంధము నాకు కుదిరినందుకు నేను గొప్ప అదృష్టవంతురాలనని నా పుట్టింటివాళ్లు భావించడము, నా చెలులు "తారాబాయి నరేంద్రుని పట్టపురాణి, కుబేరుని కాంతామణి ఏమి పుణ్యము చేసిందో" అని హెచ్చరించడమూ, దక్షిణాపథ సంపద గురించి హద్దులేని ఊహాలు కల్పించుకొని నేను సకల విధములా ధన్యనని అనుకోవడమే కాని, కారాగారవాసము మాకు ప్రాప్తిస్తుందని ఎవరూ తలచియుండరు. కుబేరుని ఇల్లాలినైన కూటికి ఇబ్బంది పడుతానని నా నుదుట వ్రాసియున్నది; లేకుంటే పనులపాచ బడి అన్నవస్త్రాలు కరవై అందరికీ ఒదిగియుండడము కూడా నాకెంత లజ్జాకరము! ఇంతకూ "బుద్ధిః కర్మానుసారిణీ".

సూర్యా—అమ్మగారు పోరు ప్రారంభించింది. (పైకి) ఒదినా, ఇప్పుడు మీరు ప్రార్థించిన అనసూయని అన్యాయమానా స్పదమని రాజారామ్‌గారికి తోచదా? తోచి ఏమి చేయగలరు? ఎటుచూచినా మరాఠా స్థానమూ దుఃఖవార్ధిలో తేలుతూన్న తుపానులూ గోచరిస్తూన్నవి. ఇట్టివేళ వారు నిర్వీర్యములు కావడము ఒక వింతా? చెడుకాలము వచ్చినప్పుడు ఎట్టి బుద్ధిశాలురైనా కలవరపడుతారు.

తారా—ప్రారబ్ధకర్మను అనుభవించి తీరవలసినదే. దుర్దైవాఘాతము తప్పించుకొను యత్నించడమే పౌరుషము కాని పులిని చూచిన మేకలాగు గుండె చెదరి, కాళ్లుచేతులు లాడక, కష్టములకు తలయొగ్గి నిలవడము శూరధర్మము కాదు. ఇప్పటికి తొమ్మిదేళ్లనుండి ఒక్కతీరున పడరాని పాట్లపాలయి నాము. బావగారి గౌరవము పాలించడము ఇంకెన్నాళ్లు? రాకూడని రాయిడి సంఘటిల్లినది. మేమేలాగు వ్యవహరించినా వారికి శత్రువులమే కాని మిత్రులము కాలేము, మాకు చావు తప్పదు. మరణమాసన్నమైనప్పుడు యాతన తప్పించుకొనడానికి కాళ్లుచేతులు కొట్టుకోవడము సకలజీవులకూ సహజమే కదా?

సూర్యా—రాణీసర్కార్, మీ యభిప్రాయ మవగాహన మయింది. మహత్వాకాంక్షకూ స్వాభిమానముకూ ఆటపట్టైన మహారాష్ట్రీకులముకు తగినమాట ఇది. (తనలో) భోంసలేవంశము నిర్మూల మొనర్చ ప్రతిజ్ఞ పట్టి గణోజిశిర్కే—

నా ప్రాపు చేరినాడు. అమ్మగారి ఆశ లడుగంటవలసినవే (ప్రకృతి) విరుద్ధశీలనాసక్తుడూ, కాలకరాళచిత్తుడు నైన శంభూజీ మహారాజావారి రాష్ట్రములో ఇట్టి రహస్యాలోచనలు చేయ నెవరు సాహసించగలరు ?—మా విషయ మాలోచించండి—నాయు దేశముఖకొరకెంతో తహతహపడి అరచేత ప్రాణాలు పట్టుకొని కూర్చొనడము నాకు ముచ్చటనుకొన్నారా ?—ఏమి చేయగలను ? ఆబాసాహెబుగారు (శివాజీ) రాసన్నమరణులై సప్పుడు రాష్ట్రశ్రేయోభిలాషులూ, రాజకార్యప్రవీణులున్నూ సంభాజీని కారాగృహస్థుని చేసి, అప్రయోజకుడనికదా పన్హాళా దుర్గమున బంధించి శ్రీరాజారామ్ ప్రభువును సింహాసనాసీనుని చేసినారు. ఈ వార్త వాయువేగమున చెవిని పడడముతోనే సంభాజీ దక్షిణాపథ మాక్రమించి ప్రజలను గడగడ లాడించి తనకు ప్రతికూలులైన స్వామిభక్తుల నందరినీ చంపి, సకలైశ్వర్యములకూ నిధానము, ప్రత్యక్ష మహారాష్ట్రవైభవలక్ష్మి యైన సోయరాబాయిని కుడ్యస్థాపనము చేసి కూల్చినాడు. అందుపై గోతపుట్టి తండ్రిపై పగదీర్చుకొన పట్టుబట్టి మహారాజుగారి ప్రాపుచేరిన అక్బరు యువరాజు సహాయమున సంభాజీని సంహరించవలెనని అన్నాజిదత్తో శిర్కేగార్లు అన్ని యత్నములూ చేసినారు, కాని "అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్" అన్నట్లు ఆమూర్ఖుని మూలాన వారి ఆటలు సాగలేదు. పైపెచ్చు ఆబాసాహెబుగారి సంగడికాళ్లు హస్తిపాదములచేత అణగతొక్క-

బడినారు. శిర్కేల శిరస్సులు బంతులలాగు మిన్ను కెగసినవి. మాతృశ్రీ యశోదాబాయి అడ్డుపడి, ఖండోజీ నీలోజీలను బ్రతికించింది కాని చిట్నవీస్ కుల మా దెబ్బతో దిబ్బ కావలసినదే. అట్టి క్రూరమృగరాజు చెంత నెవడు చేరగలడు? అట్లు సాహసించినవాళ్ళు సమూలము సమయింపబడరా? సంభాజి కోపాగ్నివల్ల పూచిన తంగేడువంటి కుటుంబము లెన్నో దగ్ధపటలము లయితీరునని ఎవ రెరుగరు? ఇట్టి పరిస్థితులలో మన కెవ్వరు ప్రాపు కాగలరు?

తారా—సూర్యాజీ, నీవు పేరుపొందిన శూరుడవు, కష్టకాలమందు ధైర్యము విడనాడదగునా? రాష్ట్రవిప్లవమున రక్తస్నానము సహజము కాదా? రాజకార్యనిర్వహణ మను ప్రాణోపద్రవకేళి కరుణార్ద్రమైన బాలక్రీడ అవునా? అకుంఠితధైర్యము అనివార్యసాహసమూ అగుపర్చవలసిన వేళలందు అనుకంప దాక్షిణ్యములున్నా చిత్తమందు చేర్చతగునా? మీరు మా రాజుగారి కత్యంత విశ్వాసపాత్రులు కావున నా మనసులోమాట సవిస్తరముగా మీకు వెల్లడిచేసినాను... ప్రస్తుత పరిస్థితులకు బాలకునికన్న ఎక్కువ భయపడుతూన్నారే!

సూర్యా—విశ్వసనీయుడను, అకుంఠితవీరుడను మా వళామహారాష్ట్రుడను, అట్టి నన్ను మీరు పరిహాసించినంత మాత్రాన నా ప్రతాపము తగ్గిపోదు... ఇంతవరకు నేను మీతో ప్రసంగించినది ప్రజావిషయము. నే నెన్నటికీ విశ్వాసఘాతకుడను కాను. కూడుగుడ్డల నొసగి బ్రోచిన ప్రభువు పక్ష

ముస బోరవిరిచి నిలువబడువాడనే కాని భీరునివలె పరుగెత్తువాడను కాను.

తారా—ఇప్పుడు మీ ప్రభువెవరు? వారిని మీ రేలాగు సేవిస్తూన్నారు?

సూర్యా—దక్షిణాపథ ప్రభువులు ఛత్రపతిభోంసలే నరేంద్రుల సేవకుడనై సర్వశ్రేష్ఠమైన రాయగడదుర్గమునకు అధ్యక్షుడనై ఉన్నాను.

తారా—ఆ భోంసలేరాష్ట్రము ఇప్పుడు దురాచార దుశ్చరితమనే సుడిగాలిలో దుమ్ము రేగిపోవడము మీకళ్లకు కనబడలేదా? కర్దమదుర్వ్యసనాసక్తిచేత పాడుచెడి భోంసలే రాష్ట్రము ఆలంగీరు పాదుషా వారి రాష్ట్రమువైపు ఒరుగుతూన్నదని మీకు తోచలేదా? రాజుగారి కైపు మిక్కుటమై వారి అన్నము తినే మావళాలకు మీకు వాసనగొట్టలేదా? రాష్ట్రదుస్థితి పలుబారలేదా? చతురంగబలసమేతుడైన శ్రీశివాజీప్రభువుగారు అస్తమించిన తరువాత ఆతని అగ్రసుతుడు నిర్జీవమైన చతురంగపు రాజుగా మారడము వారి రాష్ట్రహితైషులు అనుపమవిశ్వసనీయులైన మీరు గ్రహించలేదా?

సూర్యా—గ్రహించకేమి? అంతమాత్రాన లాభమేమి? భూకంపమును దాని పూర్వసూచనలబట్టి గ్రహించడము సులభమే, కాని దాని నివారించు ఉపాయము కనిపెట్టడము సులభేతరము.

తారా—నిజమే—అందుచేతనే పనిబడ్డప్పుడు ఒళ్లు దాచుకొనే మతిహీనుల మాటలూ ఆటలూ సాగుతూన్నవి. జంభాలరాయళ్లు దంభాలకు తావు యథేచ్ఛముగా కలుగుతూన్నది. నిర్వాహకుల ఘనకార్యములు, సోమరుల తుంటరి పనులూ సరిజేసి చూడబడుతూన్నవి. మునుగుతూ అడుగంటుతూన్న భోంసలే ప్రభుత్వమును తేల్చి పృథక్స్థాపనము చేయువలెనని చిన్నరాజుగారికి అభ్యర్థిస్తూండగా సంభాజి భీతిచేత దంభవాక్యములకండ జేగి దేశీయుల చిత్తములు నిరుత్సాహము లవుతూన్నవని సూర్యాజీపిసాళ్ కండోరా వేస్తూన్నాడు.

సూర్యా—కాలానుగుణమని నాకు స్ఫురించినది నా మనస్సుకు వచ్చినదీ నిష్కపటభావముతో నివేదించినాను; అధికము అప్రస్తుతమూ అయిన ప్రసంగమువల్ల యజమానుల మనస్సు నొప్పించవలెనని నా ఉద్దేశము కాదు. నేనిచ్చిన సలహా వ్యర్థమని కాని అనర్థదాయకమని కాని మీకు తోచినట్లైతే, నాకు సెలవిప్పించండి. సంతతరాజభక్తులమూ ధైర్యశాలులమూ ఐన మమ్ము దంభులతోనూ పిరికిపందల తోనూ సమానముగా పరిగణించడము వింతగా నున్నది. గతమున మేమొనర్చిన సేవ ఏగంగలో కలిసింది? ప్రభువులకు సంభవించిన ఆపత్సంకటమున సమయికి వారి పరపతి నీ సేవకుడు నిలబెట్టని దృష్టాంత మొక్కటి చూపగలరా?

తారా—ఇంతవరకూ ఆత్మీయులను శఙ్కించలేను తథ్యమే, ఇప్పు డాసన్న మానేమో అనే భీతి కల్గుతూన్నది.

సూర్యా—ఎందుచేత? ఇంత హీనమైన నేరము నా మీద మోపడానికి హేతు వేమి?

తారా—శంభూజీగారి భీతిచేత నా సలహా నిరాకరించడమే నిదర్శనము.

సూర్యా—నేను రాజభీతిచేత మీమాట త్రోసివేస్తున్నానని మీ ఊహ కాబోలు!...నా మనస్సు అన్యవిషయాక్రాంత మైనది. గురి తప్పకని పూర్ణధైర్యము చిక్కినప్పుడే దెబ్బ కొట్టవలెను. ఎవని బాణ మమోఘమో వాడే విలుకాడు. మన ఆలోచన ఉభయులకూ లాభదాయకమని యూహి అయితే మీ ఆజ్ఞను తప్పకుండా శిరసా వహిస్తాను, కాని నిరర్థకముగా ప్రాణోపద్రవకరమైన తెలివితక్కువ చిందులు తొక్కడానికి నా మన సొప్పదు.

తారా—మతిమాలిన పని చేయడానికి ఎవరి ప్రాణము లంత బరువు? పిసాళ్—కళ్లు తెరచి కలియబార చూడు. ఢిల్లీ ఆలంగీరు, బొంబాయి పరంగీలు, గోవా బుడతకీచులు, జంజీరా సిద్దీలున్నూ నలుదిక్కులా యుద్ధసన్నద్ధులై మనపైని పడవలెనని కాచుకొని యున్నారు. మనలో మహాయోధులూ, అనుభవశాలులులూ మట్టిలో కలిసినారు; ఇప్పుడంతా బాలనాయకమై ఉంది. పన్నులు పెరిగినవి, చిలిపిజగడములు రాష్ట్రమున కల్లోలము కలిగించినవి. అష్టప్రధానుల అధికా

రము కలుషాత్ముడైన కలుశాయాను సంక్రమించింది. సంభాజీ గారు సంతోషసాగరాలోలుడై లోకమే మరచి హీనకులసంజాతయైన తులసీరా పణ్యరాశిలో మునిగియున్నారు. ఈరీతిని మరాఠా సామ్రాజ్యమే ఆ రాజకవి ప్రభువౌతూన్నప్పుడు నా ప్రాణేశ్వరుని సార్వభౌమభూపతిని చేయు ప్రయత్నము అయుక్తమని నీకు తోచినదా? అతిరహస్యముగా తగిన పూనికతో మన మాలోచించిన పని చేయబూనితివా పరము ఊగులాడుతూన్న మహారాష్ట్రపరిపాలన లోతుగా వేళ్ళనాటి యావచ్చంద్రతారాకమూ అనర్గళముగా ఆశ్రయించి తీరుతుంది. కలశాకబ్జ దుశ్చరితాపకారాలు త్రొక్కి మావళేమరాఠాల మందుగుండుచేత మడిసి మట్టిలో కలుస్తుంది... నేను చెప్పినట్లు చేస్తే నీవు సంతతమూ అభిలషిస్తూన్న వారు దేశముఖ నీకు ప్రాప్తింపడమే కాక భోంసలేసామ్రాజ్యమునకు ద్ధారకుడవైన అసహాయశూరుడవని నీ కీర్తి శాశ్వతముగా నిల్చిపోతుంది.

సూర్యా—(తనలో) ఈమెమాట విన్నట్లుంచకుంటే ఇక్కడినుండి బైట పడడానికి వీలుండదు.

తారా—పిసాళ్, నావి పిచ్చి కేకలని తలచి కాబోలు ప్రత్యుత్తరం మియ్యకున్నావు? లేక ఆపని నీచేత కాదా? అప్రయోజకుడవైతే ఆప్రసంగమిక కెత్తను.

సూర్యా—రాణీగారూ, మీ దూరదృష్టి రాజ్యతంత్ర ప్రవీణతా చూచి నేనాశ్చర్యపడుతూన్నాను. నా మనసు

లోకు కనుగొనక పూర్ణము సహాయగుణసంపన్నులైన రా-
రామ్ప్రభువుగారికి మన ప్రయత్నము రుచించునో లేదో
తెలుసుకొన్నారా?

తారా—లేదు.

సూర్యా—అమ్మగారూ, కాపులేని బంటు కనీసపు చావు చావడా? శిరస్సులేని మొండెము ఏమి చేయగలదు? దానికి ప్రాణము పోయగలమా?

తారా—మొండెములో చేవ లేకపోతే ఎట్టి శిరస్సైనా ఏమి చేయగలదు? తగిన దేహము తాళగలిగినప్పుడే శిరస్సు చేతనైన పనులు. ఇవి రెండూ కార్యసిద్ధికి మూల స్తంభములే.

సూర్యా—శిరస్సుకు ప్రతికూలముగా మొండెము వ్యవహరించలేదు. ప్రస్తుత కార్యక్రమము సఫలమైతే సింహాసనముపైని, విఫలమైతే వీరస్వర్గమందున్నూ శిరస్సూ మొండెమున్నూ ఐకమత్యముతో కూడియుండునని నమ్మండి. నాకు సెలవు. (పోవుదురు)



## రెండవ రంగము

సూర్యాజీ.

(తెరలో — రాయగడదుర్గముగాలి భంగులకు హెచ్చరిక! హెచ్చరిక! హెచ్చరిక! ఛత్రపతి సంభాజీమహారాజుగారిచే అవమానము పొందిన గనోజీశిర్కే మొగలుల సహాయమున భోంసలేవంశము బుగ్గిచేస్తానని ప్రతినబట్టి ఈ దుర్గములోనే మారువేషముతో సంచరిస్తున్నాడని చారులద్వారా వార్త తెలిసింది. ఆ కపటాత్ముని కనిపట్టి రాజుగారికి అర్పించిన వారికి ఐదుగ్రామాలు మొఖాసాగా ఇవ్వడమే కాక మహారాష్ట్రసభలో సన్మానము జరుపబడును.)

సూర్యా—(తనలో) హాబో! మోసమున్నదే! శిర్కేరాక సంభాజీకి తెలిసింది!

(రాజారామ్ వచ్చును)

రాజా—పిసాళ్! చాటింపు విన్నావా? ఎంత ప్రమత్తత! పారాలు పనికిరాలేదే! కోటలోని గస్తీ కొంగాలేదా! దుర్గాధ్యక్షుడవైన నీకు తెలియకనుండే ఈ వార్త మహారాజుగారి చెవి సోకింది! ఇదా నీ ప్రయోజకత్వము? దీనివల్ల నీ పరామరిక తేటతెల్లమౌతూన్నది. ఇప్పుడే రాజప్రాసాదముకు పొమ్ము. ఇక్కడ నిరర్థకముగా కాలయాపన చేస్తూన్నావని మహారాజుగారికి తెలిస్తే వారి కనుమానము కలిగి మనకందరికీ ముప్పు మూడగలదు.

(తారారావు వచ్చును)

సూర్యా—ఇదిగో! ఇప్పుడే రెక్కలు కట్టుకొని రాజప్రాసాదము చేరుతాను.

రాజా—అన్నగారి కుశలవార్త అతివేగము పంపు.

సూర్యా—చిత్తము అట్లే కావించెదను. (పోవును)

తారా—అన్నగారిచేత ఆ జీవమూ బందిఖానా యందు బంధింపబడ్డ వీరికి నాని యోగక్షేమముల గూర్చి ఎంత చింత! (పైకి) మహారాజుగారిని గురించి ఇంత మమత కలవరమూ మీ కెందుకు? భోంసలే రాజప్రాసాదము పర్వత కందరము కాదు, ఘోరారణ్యమూ కాదు; వేనవేలు రాహుతులు, శస్త్రపాణులైన శూరులు కంటిని రెప్పవలె కాచుతూండగా అంతటా ఇంద్రవైభవముతో నిండి యున్నది. ఒక్కపెట్టున నూటయెనిమిది తోపులు పేల్చగల రాజదుర్గము—దాని కేమి లోటు?

రాజా—ఆ మాట నిజమే. భవనము కావుననే ముఖ్యముగా భయాస్పదమని నాకు బెంగగా నుంది, ఇదే గర్భదరిద్రునిగుడిసె అయి మేము నివసించే నిరుపేదల మైతే కలవరముకు కారణమే ఉండకపోను!

తారా—బాగు బాగు. మహారాజప్రాసాదములు మరణభీతి కాలవాలములని మీ అభిప్రాయమా?

రాజా—అందుకు సందేహమా? దుర్విషయాసక్తులైన దుష్టనృపతుల నగరులు అనేక పాతకములతో నిండి

పట్టపగలు రక్తధారల నెగజిమ్మే కసాయి కొట్టులు. అరాజక రోగగ్రస్తములై పొరలుగప్పిన కళ్లకు దేదీప్యమాన నిజదివ్య తేజముచేత నావరింపబడిన పతివ్రత, ఎగువసొమ్ములు, ఇతర క్షణికకృతకశృంగారములతో కులుకుతూన్న కులటవలె కాన్పించును. స్వాతంత్ర్యముకై పోరాడు మహనీయుల మస్తకములు హింస్రమైన అకాలమృత్యువువాత పడుతూన్నవి. స్వకీయుల ఆకాంక్షానిమితంబులు బైటపెట్టు స్వార్థపరులు తమకార్యము నిర్వహించుకొనదలచి ఎట్టి హీనకార్యము లొనర్చుటకైనా సిద్ధపడి పైకిమాత్రము రాజభక్తులవలె మసలుతూన్నారు. ఇట్టి కల్లోలావస్థలో న్యాయము ప్రతిష్ఠించి, ప్రజాకర్తృత్వ నిర్వహణోత్సాహము సంఘటించి తండ్రిగారి శ్రీరామ రాజ్యము పునరుజ్జీవనము చేయవలె నంటే నూత్నసార్వభౌమోదయము కావలెను.

తారా—ఏమి? మన మహారాజుగారా మహాత్కార్యము సాధించలేరా? వీరు మాత్రము ఛత్రపతులు కారా?

రాజా—ఛత్రపతి మాట సత్యమే. ఇతడు పుట్టు ఛత్రపతి కాని పెట్టుఛత్రపతి కాడు—ఏమని చెప్పుదును? దుఃఖము పొంగి పొర్లుతూన్నది. మా అన్నగారే తండ్రికి తగిన తనయు లయితే మాకు రక్తబంధువులై మేలు కీళ్లయందు మాతో భుజములు కలిపి సామ్రాజ్యక్షేమమునకు ప్రాణము లొడ్డి పాకులాడిన శిర్కేవంశజులు మాపై పగబట్టి ప్రతిశత్రులతో చేరి మాసామ్రాజ్యమునే కాక మా వంశము

కూడా నిర్మూలము చేయ ప్రతిజ్ఞ పట్టియుందురా? ఉత్తమోత్తముడైన శాలాజీపంత్ చిట్నీస్ రక్తముచే భోంసలే ప్రభువు హస్తములు గ్రస్తము లవునా? శివస్థాపితమైన మాతుశ్రీ సోయరాబాయి కరుణాక్రందనము...వద్దు, వద్దు. ఆమాట తలుచుకొంటే కడుపు చెరుగుకో పోతుంది. భోంసలే కులదేవతా! భవానీ! మా అన్నగారికి ఛత్రపతికి తగిన బుద్ధి దీర్ఘాయుష్యున్నా ప్రసాదించు మమ్మా! ఇదే మేము కోరేది.

తారా—కులదేవతలారా! వినండి. రాష్ట్రనిర్మూలన మునకు భావగారికిన్నీ వారి బందిఖానాలో నుండడానికి నా ప్రాణేశ్వరునికీ దీర్ఘాయు వొసగండి.

రాజా—తారా! ఒరిసిన పుండుపైని ఉప్పు జల్లుతూ న్నావు! నొచ్చిన మా మానసములకు నీ ఉలుకుమాటలచేత ఉత్సాహము పుట్టునని ఎంచుతూన్నావా? నిత్యకళ్యాణమూ పచ్చతోరణముగా కలకలలాడు మా కోటలో కసితీర్చుకొనే కత్తి ఝళిపించబడుతూండగా సర్వనాశ హేతుభూతమైన దుర్బుద్ధి నీ కెందుకు పుట్టింది? మాత్సర్యమును మచ్చ మాపుకో. ఇప్పుడు మాకు సంఘటిల్లిన అరిష్టములు నశించును కాని మనస్సున నాటిన మాటలు మరపురావుసుమా! తుదకు శల్యరూపములై సకల బాధలు కలిగించును.

తారా—అట్టి మాటలు నే నంటానా? అందువల్ల మీ వంశీయుల అపఖ్యాతి అతిశయించదా? స్వర్గమందున్న

దేవతాకోటి ఒక్కపెట్టున భోగుమని ఏడవదా?...ఇదిగో... నోరు మూసుకొన్నాను. పూర్వజన్మాన నే నొనర్చిన పాపము ప్రత్యక్షానుభూతికి వచ్చి నన్ను మితిలేని వెత బెట్టకమానదు. ఇకముందు ఏమివచ్చినా పెదవికదల్చక అనుభవించి తీరుతాను. కారావాసమో, కరాళమృత్యువో, కాంక్షించినది కాక తీరదు.

రాజా—మహారాజు గర్భవాసమున పుట్టుక, కారా వాసమున పోషణ. బానిసవాని పోలిక పారతంత్ర్యము! గోరుచుట్టుపై రోకలిపోటు వేసే కులకాంత, అనవరతమూ కత్తిదూసి కాచుకొనియున్న ఆత్మీయులు...అంతటా రక్త పిపాస!...కడుపులోని దుఃఖము వెడలపుచ్చవలెనంటే విని శాంతి చేకూర్చే విశ్వసనీయుడైన మిత్రుడొకడైనా కాన రాడే! ఏమి గతి?

(ఖండోజీ త్వరగా వచ్చును)

ఖండో—ప్రభూ! చిట్నవీస్ వంశజుడీ ఖండోజీ లేడా?

రాజా—ఆవ్‌జీ కులదీపకా! మాతృశ్రీ చిరుతకార్య దర్శి, ఖండోబా! నీకు నూరేళ్లాయువు! ప్రాణస్నేహితుల మాట తలపువచ్చి నీ విప్పుడే స్మృతికి వచ్చినావు; వెంటనే ప్రత్యక్ష మైనావు...ఏదీ, ఒక్కసారి నీ ఆలింగనము. నీవు దగ్గరనుంటే వేయిమంది తోడున్న ట్లవును.

ఖండో—ప్రభూ! నేను మిమ్ము హెచ్చరించడమునకే వచ్చినాను. మీ రిప్పుడప్రమత్తులై ఉండవలెను. మహా

రాజుగారు ఉగ్రకోపావిష్టులై మిన్ను మన్ను గానక వస్తూన్నారు. కలుషచిత్తుడైన కలశా వారి వెంట నున్నాడు.

రాజా—నీ పల్కు నా కార్తిసూచకముగా తోచ లేదు. కొంచెము శాంతించు.

ఖండో—ఇం కెక్కడి శాంతి? మహారాజుగారు మతి తప్పి సన్నిహితు లయినారు. సూర్యాజీ గుర్రమెక్కి వాయు వేగమున వారి ప్రాసాదమునకు పరుగెత్తుతూండగా రాజుగా రెదురైనా రట. అతడు వెంటనే తోఫ్ఖానా దగ్గర దాగి ఉండి వారివైపు తొంగిచూచినాడట. అతనిచర్య అనుమానాస్పద మనిన్ని, శిర్కేలతో సూర్యాజీకి సన్నిహితసంబంధ ముండి తీరుననీ, మహారాజుగారి చెవి కలశాకబ్జీ కొరికినాడు. వెంటనే సూర్యాజీని బంధించవలెనని మహారాజుగా రాజ్ఞాపించి మీవైపు దయచేస్తూన్నారు. ఇంకేమిదురంతము చేయ నెంచినాడో ఆ పయోముఖవిషకలశము.

(తెరలో—మోసకాడా, గణోజీశిర్కే ఎక్కడున్నాడో చెప్పు)

అదిగో ఇటే వస్తూన్నారు. మీ రిక్కడే ఉండండి. నేను యేసూ (యశోదా) బాయిగారిని పిల్చుకొని వస్తాను.

(పోవును)

రాజా—దేవీ—నీవు లోని కేగుము. (ఆమె పోవును)

(సూర్యాజీని గెంటుకొని సంభాజీ వచ్చును. వెంట కబ్జీ, ఇద్దరుభటులూ వత్తురు)

సంభా — మూర్ఖా, విశ్వాసఘాతకా! కోడిగట్టి ఏమి బావుకొంటినావు? బంగారుగోడలు కట్టుతావా? పెళ్లాన్ని రత్నములు చెక్కిన నగలలో ముంచుతావా? మహారాష్ట్రమును నేనొక్కడనే ఉద్ధరిస్తానని మీసములు దువ్విన ఫలట వలె కులనాశకుని కోటలో చేర్చినావా?... రాజారామ్ మహారాజుగారూ, మీరు మాకు సోదరులు కదా ఈ కుట్రవిషయమునను మేము ప్రశ్నించగలము?

రాజా — మహాప్రభూ! మా సోదరులము శ్రీ ఛత్రపతి శివాజీమహారాజావారి సంతానములోనివారము — ఏకగర్భజనితులము కాకున్ననేమి? ఇట్టియెడ మనరాష్ట్రమునకు ప్రతికూలముగా నిలుపబడిన కుట్రనుగూర్చి నన్ను ప్రశ్నించవలసిన కారణ మేమి?

కలుశా — అయ్యా, సంభాజీమహారాజుగారిని పన్హాలా దుర్గములో బంధించి మహారాష్ట్రసింహాసన మపహరించ...

రాజా — కలుషాత్మా — నోరు మూసుకో — సోదరులమగు మేము మాటలాడుతూండగ మామధ్య పానకములోని పుడకలాగు పడుదువా?

సంభా — అతనిమాట అసత్యము కాదు. లోగడ జరిగిన ఘటనా సంచయము మరువదగినది కాదు. శిలాశాసనతుల్యమైన మన రాష్ట్రచరిత్రలో ఆ అంశము రూఢిగా చెక్కబడినది. ఆనాటివారు, ఆ రక్తబంధువులు, సోదరులు, మమ్ము బంధించి మాపరిపాలన మంత మొనరించదలచిన రాజా

రామ్ మహాప్రభువుగారు ప్రకృతిని కూహకనుండు ప్రశ్నించ బడుట కగత్యమేమి అని అడుగుచున్నాను!...అబ్బా! నా కేమియు తోచకున్నది.

రాజా—కూహకములతో నా కెట్టిసంబంధమూ లేదు. మీ నిరంకుశవ్యసనాసక్తియే అట్టి సంబంధము కల్పించి యుండును. శంభూజీకన్న రాజారామ్ మేలని శ్రీ ఆబా సాహెబుగారు తలచినట్లే అష్టప్రధానులూ ప్రజలూ అనుకొనియుండవచ్చును. అందుకు నాపై ద్రోహారోపణ చేయు నేల?...ఇంతవరకు మీయెడ నేనేఅపరాధమూ చేసియుండ లేదు. ఇప్పుడూ చేయలేదు.

సంభా—రాజరామ్ మహారాజా! నేను కేవలం వీరు డను. అడవులలో వేటాడడము, శత్రువులతో సంగరము సల్ప డమూ నాచేతనైన పనులు. వీటికి ప్రతిగా సురాపానమూ మత్తకాశినులతో క్రీడలూ నాకు విశ్రాంతిస్థానములు. ఒరు లెవ్వరైనా నాజోలికి రాకుంటే విలాససౌధాంకమైన నాసుఖ నిద్రనుండి నేను మేల్కొనడమే అరుదు. భుజబలముచేతనే కాని బుద్ధిబలముచేత కార్యము సాధించడము నావల్ల కాదు; నాయెడ అన్యులు దానిని ప్రయోగించడము నేను సహించ లేను. నేను సింహాసనాసీనుడనైతే మన రాజ్యమునకుపద్ర వము సిద్ధించుననే నమ్మకముచేత నన్నాజన్మాంతమూ కారా గారమున బంధించడముకన్న శ్రీరాజారామ్‌గారిని ఛత్ర పతినిచేసి సింహాసనాసీనులు చేయవలసిందని అష్టప్రధానులూ

నన్నడిగియుంటే తక్షణమే రాజపదవి త్యజించి అతివినయముతో నా ప్రభువునకు వందన మాచరించియుందును. అట్లు చేయకుండిన నేను భోంసలేవంశజుడనే కాకపోవుదును.

రాజా—పరమసంతోషము. "యథా రాజా తథా ప్రజాః" రా జెల్లప్పుడూ స్వార్థము త్యజించవలెనని ఆబాసాహెబుగా రంటూఉండేవారు. అందుచేతనే అష్టప్రధానుల కంతరాజ్య మప్పగించి వారు వైరాగ్యసూచకమైన కాషాయ కేతన మెత్తియుండిరి. భోంసలేవంశమువారందరూ అట్లే ఆచరించవలెనని వారి అభిప్రాయము. వారి తనయుల మన్యథాకరించ వచ్చునా? ప్రభువుగారికి భోంసలేవంశ మర్యాద తెలియనిది కాదు. ఇట్టి సందర్భమున షడ్యంత్ర పాపము నా కారోపించడమున కాధారము కానరాదు. ప్రభుపాదములు సాక్షిగా ప్రమాణము చేసి చెప్పుతూన్నాను. యావజ్జీవమూ భోంసలే ప్రభుత్వమును బాగు చేయవలెననే కాని తత్సింహాసనాధిరూఢుడను కావలెనని నాకు కోర్కెయే లేదు.

సంభా—అలాగైతే గణోజీని కోటలోనికి రానివ్వనేల?

రాజా—నా కతనితో నేమీ సంబంధము లేదు. అతడు కోటలో కేలాగు వచ్చెనో నే నెఱుగను. లోగడ జరిగిన కార్యసంచయముచేత ప్రభువువారి చిత్తమందు గట్టి అపనమ్మకము కలిగింది. చాలాకాలముకిందటనే మావళాలపై

మీకు సంశయము కలిగినట్లు నే నెరుగుదును. ఇప్పుడు నేను చేసిన ప్రమాణానంతర మట్టి శంక ఉండగూడదని నా ఊహ.

కబ్జీ—ప్రాణోపద్రవ మాసన్నమైనప్పుడు ప్రమాణము చేయడము భోంసలేవంశజులకు పాడికాదు– మహాకాళి మాట తప్పవునా ?

సంభా—రాజాగారూ, భవానీసాక్షిగా చెప్పండి– గడియకిందట పిసాళ్ హాతకుడు ఇక్కడుండెనా లేదా ?

సూర్యా—ఆహా ! ఉన్నాను. వాడుకప్రకారము కారాగారబద్ధుల కుశల మారయుట కిక్కడికి వచ్చినాను.

సంభా—కైదీల క్షేమ మరయుచుంటివా? నీ ప్రభువు మెడపైని శత్రువులు కత్తివేయ యత్నిస్తూంటే అది మరచి నీవితరవిషయము లరయుటకు హేతు వేమి ?

సూర్యా—నే నప్రమత్తుడనై ప్రభుసేవయే చేస్తూంటి నని ప్రమాణపూర్తిగా నివేదించుకొంటున్నాను.

సంభా—ద్రోహీ ! ప్రమాణముమాట ఎత్తకు. నీ మాటే నిజమైతే గణోజి రాయగడదుర్గము చొరగలడా ?... రాజారామ్‌మహారాజా, నిస్తుల సత్వసంపన్నులు ప్రభు విశ్వాసధురంధరులు నైన మీబోటిధైర్యశాలురు షడ్యంత్ర మనే సంజీవి పోయకుంటే పిసాళ్ వంటి పీనుగులు మాఎదుట సంచరించగలరా ?...ఒక్కమాట మరువకండి, శిర్కేల పీకలు తెగనరికిన ఈ చేతు లింకా గాజులు తొడుక్కోలేదు. రాజ

ద్రోహులను గాడిదెలపై ఊరేగించి కొండమీదనుండి తోయించితీసుతాను...సూర్యాజీ, ఇప్పుడేనా నిజము చెప్పి ప్రాణాలు దక్కించుకో ... మాట్లాడవేమి? ... ఎవరురా అక్కడ? కొరడాతో వీనిని కొట్టు—(అట్లు చేయుదురు) కానీ, కానీ, ఇంకోసారి ... ఆగు ... సూర్యాజీ—ఊరక ప్రాణము లెందుకు పోగొట్టుకొంటావు? ఇప్పుడైనా నిజము సవిస్తరముగా చెప్పితే క్షమిస్తాము.

సుర్యా—కుట్రయే లేదు—నే నేమి చెప్పగలను? నన్ను నిష్కారణముగా నిందించి దండిస్తున్నారు మహాప్రభూ!

సంభా—ఆహా. ఇంకా నిరోగము మళ్లలేదు. దాలతి, ఎత్తు కొరడా! కానీ! ఇంకా! ఇంకా! (యేసూ బాయి ఖండోజిన్ని వత్తురు).

యేసూ—(తెరలో) దాలతీ, ఆగు.

ఖండో—మహారాణీసర్కార్ దయచేస్తున్నారు. కబ్జి, ఇక్కడనుండి పో.

కబ్జి—(తనలో) నా పన్నుగడ మధ్యనే మడిసే టట్లుంది. మహారాజుగారి నిక్కడినుండి తొలగించవలెను, లేదా ఖండోజిని తగిలివేయవలెను. లేకుంటే నా పరపతికి భంగము వాటిల్లుతుంది...(పోవును)

ఖండో—(తనలో) గణోజీని కోటలో ప్రవేశ పెట్టినవా డీకలుషాత్ముడే కావచ్చును. వీనిపై నొక కన్ను వేసియుండ వలెను. (వెళ్లును)

(యేసుబాయి వచ్చును)

యేసూ—ఏమి టీసం డి? ప్రభువుగా రింతదూరము రావలసివచ్చిందా? సూర్యాజీ, నీ వేదో గొప్ప నేరము చేసిన ట్లుంది. దుర్గాధ్యక్షులు కీ తెలుసునా? నుర గారి మొగము న్నపోయిం దేమి? కన్నీ రొలుకుతూన్నట్లుంది. పెడ మొగము పెట్టినా రేమి? నాతో మాటాడరా?

సంభా—ఏమని మాటాడగలను? మొగము చూడ టానికి ధైర్య ముండవద్దా? దేవి, నీ విప్పు డెవనిని నూటా ంచ నెంచుతూన్నావో, వాని సిమహాంగిత్యమునకు ప్రతి ఫాలుడు సుమా!

యేసూ—ఈ విషము మీకు పెట్టినవా రెవరు? కాలసర్పమునోటినుండియే ఇట్టి విషము వెడలుతూండును. తెరు లింత పాపమున కొడిగట్టి నోరు చెడగొట్టుకోరు. ఇట్టి అసత్య మెవ రాడినారు?

సంభా—దేవీ, కాశీవాసి కాళీభక్తాగ్రేసరుడు మహా మాంత్రికుడైన కలశాకబ్జీ మహాదేవి ప్రత్యక్షమై నృప్తాం కరించిన వార్త అసత్యమవునా?

యేసూ—ఈవిషయమున మాంత్రికుని ఊహేమిటికి? అది నా సౌభాగ్యమునకు సంబంధించినదని మీరే సూచించి నారు. దాని తొలగింప యత్నించేవారిపక్షము నేను వహిం తునా? ఇదివరకు అనేకమారు మహారాజగారిని అధనము రెండు మారులైనా చూడక నేను దేవి నారాధించలేదు, భోజనము

చేయలేదు. అట్టియెడ వారేదైనా కుట్ర చేస్తూన్నట్లయితే నాకు తెలియకుండునా? కోటలోని చాటింపు విన్నాను. తోడనే పిసాళ్‌ను రాజనగరు కంపి నే నంతఃపురమున కేగినాను.

రాజా——(తనలో) ఈ సాధ్వి నన్ను రక్షించుటకై శుద్ధాబద్ధ మాడింది.

సంభా——దేవీ, కబ్జీ అసత్యవాది అని కాబోలు నీవు చెప్పదలచితివి!

యేసూ——నే నిప్పు డట్లు నిశ్చయముగా చెప్పలేను, చెప్పినా మీరు నమ్మజాలరు. కబ్జీమాటయందలి నిజము నిలకడపై తేలును. కాళికాదేవి మాటకు కబ్జీ అపార్థము చేసి యుండునని మాత్రము చెప్పగలను...భోంసలేవంశజులు చేసిన పుణ్యము గొప్పది కావున మూడు తరాలనుండి మహాకాళి వారికి ప్రత్యక్షము కావడ మనుభవసిద్ధము. మాంత్రికుల మాటలు నమ్మడము మన కులమందు లేదు, ఇప్పుడు మొదలు పెట్టడానికి తగినంత ఆవశ్యకత కానరాదు. కలశాను నిర్బంధించి అడుగుతే నిజము తేల్తుంది.

సంభా——దేవీ, నీ మనస్సమాధానమునకు కబ్జీమాట నిజము కాదని ఎంచినా శిర్కేల రహస్యాలోచనలకు గూఢ వర్తనమునకూ రాజారామ్‌గారి ప్రాపు లేదని మేము నమ్మడ మేలాగు? లోగడ ఈశిర్కేల సహాయమువల్లనే కదా అష్ట ప్రధానులూ పహ్నేలాలో మమ్ము పడతోసి ఈ రాజారామ్

గారిని గద్దెపై కూర్చుండ పెట్టగలిచినారు. అట్టి శిర్కేలమొడ ఈరాజారామ్‌గారిప్పుడు సర్దిఫ్పలై యున్నారని ఎంచ వచ్చునా?

యేసూ—ఎంచడానికేమి ప్రతిబంధకము? నిస్సందేహముగా నమ్మవచ్చును. ఇతడు నిర్లిప్తుడే...దక్షిణాపథ సామ్రాజ్యశోభనిలుపగలిచిన రాజరత్నములు దానూదవైరము కల్పించుకొని దేశమున కరిష్టము తెచ్చిపెట్ట నుద్యుక్తులు కాకూడదు. గతము ననుసరించి ప్రభువుగారికి మరదిగారిమొడ సందేహము కల్గడము సహజమే. కేవలానుమానము ప్రమాణము కాదు, సిద్ధాంతము కాదు. పన్నగడకు ప్రత్యక్ష నిదర్శనము లేనిదే ప్రభువువారు తీర్పు నీయరాదు.

సంభా—దేవీ, ఈవిషయమున మన కిద్దరికీ అభిప్రాయభేదము కలిగింది కావున సూక్ష్మతర పరిశోధన ఆవశ్యకమని నిశ్చయించినాను...సరే...తదనంతరము నా అభిప్రాయము కనుకూలములైన నిదర్శనము లగుపడితే?

యేసూ—అప్పుడు నేరస్థులను నా ఎదుట పర్వతాగ్రమునుండి క్రిందికి పడతోయించెదను.

సంభా—మంచిది. దాలతీ, ఈపిసాళ్‌ను చెరలో నుంచుము. కబ్జీని కలుసుకొని కార్యక్రమము నిర్ణయించవలెను.

(పోవును.)

రాజా—కబ్జీతో కలిసి కార్యక్రమము నిర్ణయించబడునా? మహారాణీగారూ, వింటిరా? న్యాయాన్యాయములు

షాహీ—నిస్సందేహముగా. ప్రాణమున్నంతకాలము మందుకు పాటుపడుతాను. కులగౌరవము కూలకుండను చంద్రావళి చెర విముక్తి అయ్యే మార్గము నా కుపదేశించినవారి కత్యంత కృతజ్ఞుడనై యుంటాను.

ఖండో—ఉపాయము నే నెరుగుదును.

షాహీ—ఆహా! కర్ణామృతమైన మాట విన్నాను.

ఖండో—కర్ణామృతము కాదు, కాలకూటము! గణోజి మన కోటలో పితూరీలు లేపడము నీ వెరుగుదువుకదా?

షాహీ—ఔను. ఆ ఊసిప్పు డెందుకు?

ఖండో—ఆ కుట్రలో కబ్జీ కలిసినాడని నా నమ్మకము. మహారాజవారున్నూ సూర్యాజీ కూడా ఈ విషయమున నాతో ఏకీభవించినారు—కబ్జీ రహస్యాలోచనామందిరము మీ రీరాత్రి చొచ్చినట్లయితే మీ అర్ధాంగి చంద్రావళిని చూడడమే కాక ద్రోహాలున్ను కూడా కనుక్కొనవచ్చును.

షాహీ—చంద్రావళి అక్కడెందు కున్నది?

ఖండో—ఆ లావణ్యరాశిని హరించవలె ననే కబ్జీ ఆమెను కారాగారమునందు హామీగా ఉంచినాడు.

షాహీ—ఎంత కుట్ర!...ఇక చాలు...నా సంతాప మనివార్య మౌతూంది...ఇప్పుడే పోయి కబ్జీని కాలునింటికి పంపనా?

ఖండో—అయ్యా! కొంచెము తాళండి. మహారాష్ట్రుల కళ్లలోని నలుసుగా వర్తిస్తూన్న కబ్జీ ప్రమత్తుడై

యుండునా? ఆబాసాహేబుగా రస్తమించిన దగ్గరనుంచి కబ్జీ కల్పించునట్లుగా సంభాజీపక్క చేరి చెప్పుచుమాటలచేత అతడు తనువంతా విషాక్తము చేసి ఎన్నికగన్న శూరుల నెంచరినో రహస్యముగా అంతమొందించినది మీా రెరుగరా? కార్యవాదులు బుద్ధిశాలురునైన మహారాష్ట్ర యోధుల నణగద్రొక్కి అష్టప్రధానుల అధికారము తా నొక్కడే చలాయిస్తూన్నది ప్రత్యక్షమేకదా? వీడు యావన కులమునకు ముసలమువలె మహారాష్ట్రమునకు దాపురించినాడు. వీని నిరంకుశాధికారము మహారాజుగారి అనుమతిచేత సాగుతూన్నది. కోశములో ధనమంతా దుర్వ్యయముచేయించినాడు. మన సేనలకు జీతములు పుట్టలేదని వారు మొరపెట్టితే ప్రజలను లూటీకొట్టి ఎవరికి చిక్కినదానితో వారిని సంతోషించ మన్నాడు. ఆబాసాహేబుగారు యావజ్జీవమూ ధారపోసి మానవళేసేనలో ప్రతిష్ఠించిన శాంతీదాంతిస్నిక్షణములో సన్నగిల్లినవి. అంతటా అధర్మము తాండవమాడుతూన్నది. ఈ చక్రము తిప్పుతూన్నవాడు కబ్జీ; వానియందు మహారాజుగారికి తగనినమ్మకము అమితగౌరవము—వాని కపాయము చేయదలచినవారిని తక్షణమే నిర్మూలించకుంటే మహారాజుగారి కోపము చల్లారదు; నోటి కాహారము పోదు, కంటికి నిద్ర రాదు. అట్టివానిపై కత్తి నెత్తడము అవిమృశ్యకారిత కాదా? అందువల్ల లాభమేమి?

షాహీ—నీమాట నిజమే. కాని కలశాకాలసర్ప మును కాలునింటికి పంపితేనేగాని నా చిత్తమునకు శాంతి లేదు. వాని విషమునకు విరుగుడే లేదా ?

ఖండో—లేకేమి, అది యత్నసాధ్యము. నేటిరాత్రి వాని రహస్యాలోచనామందిరము చేరి అచ్చటి వ్యవహారము సమూలముగా రేపు మహారాజుగారితో "ఇదిగో సూర్యుడు, ఇదిగో సైంధవుడ"ని నిదర్శనపూర్వకముగా వెల్లడి చేస్తే అందుమూలాన చంద్రావళికి సంక్రమించిన దేహపీడ మాత్రమే కాక మన గాత్రమును నావహించిన తరుగు రోగముకూడా తొలగుతుంది.

షాహీ—అ దెట్లు సాధ్యమగును ?

ఖండో—ఉపాయశాలురు మీరే ఊహించండి. అతి జాగరూకతతో మెలగవలెను సుమండీ. నేను పోయివస్తాను. మీ కోర్కె సిద్ధించుగాక ! (పోవుదురు)

---

నాల్గో రంగము

రాయగడకనుమలో మందిరము.

చంద్రావళి—ఖాశాబా.

ఖాశా—ఈ చంద్రావళి మనస్సు తనవైపు తిప్పు మని కబ్జీ నన్ను నియోగించినాడు కాని నాబోటి దరిద్రుల మాటలు నవయువతులకు నచ్చునా? అలాగైతే కబ్జీకి తోసి రాజని నేనే దీనిని దక్కించుకొందును. నా దుష్కార్యవశమున

కురూపి నైనాను, అందుచేత తాడుకట్టిన దే నన్ను తలపదు. చిన్నప్పుడే దానిని తలిదండ్రులు నామెడకు కట్టినారు గనుక విధిలేక నాపెళ్లాము నన్ను కనిపెట్టుకొని ఉంది... ఈ చంద్రావళి నెలరోజులనుండి నాతో కలిసియున్నా ఒకసారియైనా నావైపు చూడదు, ఒక్కమాటైనా ఆడదు...ఇందుకు నా కొక పోటీదారు ఉన్నాడు సర్జాబా. వాడూ దీనిపైని కన్ను వేసినాడు,...మా కిది లొంగడము పాలెక్కి.

(తెరలో ఖాశాబా అని పిలుపు.)

అదిగో, కొంప మునిగిపోయినట్లు నా డిప్పుడే వచ్చినాడు. ఓహో! ఏమి ఈ వృద్ధభల్లూకము వైఖరి! గర్భాధానపు పెళ్ళికొడుకులా గలంకరించుకొన్నాడు—రానీ—ఇక్కడికి ముగ్గురము సరసులము దాపురించినాము. ఈ చంద్రావళి మాఅందరి కళ్ళలోనూ దుమ్ము జల్లేటట్లున్నది.

(సర్జాబా వచ్చును)

సర్జా—ఏమండీ దొరగారూ, పిలుస్తే పలకనేలేదు?

ఖాశా—అదేమో? నీవని ఏలాగు గుర్తుపట్టడము? ఇక్కడ భూతాలూ పిశాచాలూ అప్పుడప్పు డరుస్తూంటవి. నీవు మనుష్యుడ వేనా?

సర్జా—బాగా చూడు— నీకళ్ల కెలాగు కనబడుతూన్నాను?

ఖాశా—మనుష్యులలాగు కనబడ్డవా రందరూ మానవులు కారు. నరపశువు లనే జాతి ఒక టుంది.

సర్జా—నీ జాతికి చెందిన ట్లున్నావు.

ఖాశా—పహరా విడిచి లోని కెందుకు వచ్చినావు?

సర్జా—కోటనుండి దూత వచ్చినాడు.

ఖాశా—ఏమి విశేషాలు ?

సర్జా—చీకటి పడ్డతరువాత ఏదో అగత్యపుపని మీద వాళ్లు కొందరు మహనీయులతో వస్తారట. జాగ్రత్తగా నుండుమని చెప్పినారు.

ఖాశా—రాత్రి అంతా రహస్యాలోచనలు జరుపు తూండడముచేత కును కన్నది లేదు. అప్పుడే చీకటి పడు తూన్నది. కొంచెము వెన్ను వాలిస్తే మంచిది.

సర్జా—నీవు పోయి పడుకో—నేను దీనితో రెండు మాటలాడి వస్తాను.

ఖాశా—నీ కాలు గడపదాటితేనే కాని నా కన్ను మూతపడదు. దయచేయుండి రామ్‌రామ్.

సర్జా—నేను దీనితో మాట్లాడితే నీ కొం పేమి మునిగింది !

ఖాశా—మెత్తని మాటలతోనే కార్యము సాధించు కొనేవాడవు, ముసలివాడ వైనావు. ఈ చిలిపిఆట లిక మాని భగవద్ధ్యానము చేసుకో.

సర్జా—నన్నెత్తిపొడు స్తున్నావా ?

ఖాశా—పగని న్నాపకము పెట్టి గాంలో కొంత విశ్రాంతి తీర్చుకొంటాను...(ఇద్దరూ పోదురు)

చంద్రా—హా! దైవమా! నా పాట్లింత యొందివా? పతివియోగ బాధతో నింకెంత కాలము ప్రాణములు భరించగలను?...హా నాథా! నేనావాని కంతటికీ సముద్రోత్సాహము జనింపజాలు సజీవమైన నీవాక్కుల నీ భార్యమానము సంరక్షింపకుంటే వాడికి తలవంపు కాదా? నీ ప్రాణేశ్వరి ఆశామాత్ర జీవితయై యున్నది...దానికి సుఖము చేకూరునో లేదో?...ప్రాణేశా! నా ప్రాణము తహతహ పడుతూన్నది. దుఃఖము నిర్భరమౌతూన్నది—ఏమి చేయగలను?

(సర్జాఖా వచ్చును)

సర్జా—ఖాశాబా కన్ను మూసినాడు. వాడు లేచే లోపల దీనితో మాట లాడుతాను...నే నిదివర కెందరి కాంతలనో వలలో వేసుకొన్నాను కాని ఈ చంద్రావళి ముందర నా పాచిక పారేటట్టు లేదు...ఇది మహాసాధ్వివలె నటిస్తూన్నది...చెప్పవాల్చిక మోహాస్త్రములు పరిపినాను, కథలు చెప్పినాను, పాటలు పాడినాను, మాట లాడినాను...కర్ర బొమ్మలాగు ఒకదానికీ మారు పల్కదు. సామదానభేదములు సాగలేదు. దండింతా మంటే ఖాశాబా కబ్జీతో చెప్పునేమో అని భయము...ఇంకోసారి యత్నిస్తాను. (పైకి) చంద్రావళీ, చంద్రావళీ!

చంద్రా—ఎవరాపిల్చినది?

సర్జా—నేను సర్జాఖాను.

చంద్రా—పాపాలభైరవుడా ప్రత్యక్షమైనావా?

సర్జా—రాజకార్యములోని చిట్టెలా గెంతకాలము పటపట కొట్టుకొంటావు? నీ యవ్వన మంతా వ్యర్థ మవుతూన్నది. ఎన్నాళ్లిట్లు కష్టపడుతావు? నావంటివాడు...

చంద్రా—ఓరీ, కష్టబడడానికి తగినంత ధైర్యము నాకుంది. నీకు నియమితమైన పహారాస్థలము విడిచి లోపలి కెందుకు వచ్చినావు?

సర్జా—నిన్ను చూడక తీరని ముండలేను. నీవు నిరంతరదుఃఖవై బాష్పధారాకలుషితనై కాలము గడుపుతూంటే నాకు ప్రాణసంకటముగా ఉంది. నీ దుఃఖోపశమనము చేయవలెనని కాంక్ష కలుగుతూంది.

చంద్రా—నీకు నేను కూతురువంటిదానను కనుక నా దుఃఖము నీకు నిర్భరము కావడము సహజమే.

సర్జా—వట్టి మాటలవల్ల నీ దుఃఖము తీరునా? నాకోర్కె తీడేరునా?

చంద్రా—కోర్కె తీడేరు టేమిటి?

సర్జా—చంద్రా! నీ వెంత బేలవు! ఈమాత్రము గ్రహించలేవా? నీవు నవయువతివి, కమనీయగాత్రవు. నీశోభ అడవిగాచిన వెన్నె లయింది. దానివల్ల నీ వేమి సుఖపడుతూన్నావు?—మానవులకు వివేక ముండవలెను.

చంద్రా—నీమాటలు నాకు బోధపడలేదు.

సర్జా—గడుసు పోకడలకు పోకు. నామనసులో మాట నీకు తెలియనే లేదా? ఏదీ, తెలియలేదని నాచేతిలో చేయి

వెయ్యి. తేటతెల్లముగా తెలియబఁడ్తాను. ఇది నీ కిష్ట మేనా ?

చంద్రా—ఓరీ పాపీ! ఏటిమీద ఏడు పడ్డకొద్దీ నీబుద్ధి బూడిద అవుతూన్నదా? నీ అంతరమేమి? నా అంతరమేమి? నోరు మూసుకొని పో.

సర్జా—టక్కులాడీ—పెంకెవేషము వేస్తే ఇంక నీపాట్ల కంత ముండదు. బుద్ధికలిగి వర్తించు.

చంద్రా—అది నే ననవలసిన మాట—(ఖాశాబా వచ్చును)

ఖాశా—ఏమి టీ కేకలు?

సర్జా—(ఊర కుండును)

ఖాశా—ఏమి మాటాడవు? నీ తపస్సు బెడిసికొట్టిందా ఏమి?

సర్జా—ఖాశాబా! మెలకువ వచ్చిందా?

ఖాశా—దాని కేమిగాని మంతనము లాడ వచ్చి నావా?

సర్జా—ఇన్నేళ్లు వచ్చినవి—ఇప్పుడు మంతనము లేమి ఆ దినములు గతించినవి.

ఖాశా—అలాగా? దినములు గడిచి రాత్రులు మిగిలి నవా?

సర్జా—పరస్త్రీని పాపదృష్టితో చూడనని ప్రతిజ్ఞ పట్టినాను.

ఖాశా—స్వప్న భాసము నాలుకొంటే అంతా మన వాళ్లే!

సర్జా—నీ శ్లోకా—కీనితో నేను మంతనము లాడ లేదు; నీవు కుకుకుతీసినావు—దీనిని కాచుకొని ఉండు. నేను బయటనుండి కబ్జీ రాగానే కబురు చేస్తాను—(పోవును, వెంటనే వికారరూపుడైన వేటకాడు విల్లెక్కుపట్టి వచ్చును)

వేట—పులి! పులి! పులి!

ఖాశా—అరెర్రె! ఏమి భయంకరమైన రూపు! భూతము కాదుకదా! తడబడ కూడదు—నీ వెవడవు?

వేట—మనిషిని.

ఖాశా—అలాగా? నీరూపము చూస్తే సందేహము గానే ఉంది—అయ్యా, మీ రెవరు?

వేట—మనిషి నని చెప్పలేదూ?

ఖాశా—ఆఁ మనిషివే—అడవిపందిలాగు ముక్కుకి తిన్నగా వచ్చినావు. చీకటిపడ్డతరువాత ఉత్తరువు లేకుండా రాకూడదే?

వేట— నేను వేటాడిన మృగ మీదారిని వచ్చింది.

ఖాశా—ఈ గుహాలోని మృగానికెందరు వేటకాళ్లు? ఇప్పటికి ముగ్గుర మున్నాము—నీవు నాల్గో వాడవు—దీనిని పెళ్లి యాడిన పాహీంగుమాట తల పెట్టనే లేదు... ఈ మ స్తరింకెంత రకూ వి స్తరిస్తుందో?... అయ్యా, నీ మృగ మేజాతిది.

వేట— పెద్దపులి.

ఖాశా—మొగదా ఆడదా?

వేట—ఆడది.

ఖాశా—నిజముగా పులియా? లేక పులివంటి ఆడదా?

వేట—టక్కరిమాట లాడితివా తల బద్దలవుతుంది జాగ్రత్త!

ఖాశా—ఇతడు పిచ్చివాడులా గున్నాడు—మచ్చిక చేసుకొంటే మేలు—మిత్రమా! ఇదిగో యిప్పుడే వస్తాను, నీవిక్కడ నుండు—(వెళ్లును)

వేట—చంద్రావళీ!

చంద్రా—ఎవరది?

వేట—మెల్లగా మాట్లాడు.

చంద్రా—నీవెవడవో ముందు చెప్పు.

వేట—(వేషముతీసి) ఇప్పుడు తెలిసిందా?

చంద్రా—హా! ప్రాణేశా! (కౌగలించును)

వేట—గోల చేయకు—కడచిన రెండుదినములలో కబ్జీ ఇక్కడికి వచ్చినాడా?

చంద్రా—రావడమే కాదు—గణోజీతో నేదో రహస్యాలోచన నడుపుతూన్నాడు.

షాహీ—ఖండోజీమాట నిజమే.

చంద్రా—నేడుకూడా వస్తాడు.

షాహీ—ఇప్పుడే వస్తాడా? ఎవడో వస్తూన్నట్లుంది, లోనికి పో (ఆమె పోవును)

(ఖాశాబా వచ్చును)

ఖాశా—నా అదృష్టము నేడు పండింది, సర్జాబా లేడు. ఈవేటకానితో మైత్రి చేస్తే నాకు చాలాలాభ ముంటుంది. (పైకి) మిత్రమా, నాకు కొంచెము నోటివడి ఉన్నది, లోపల కపట మేమీ లేదు.

వేట—అయ్యా, నే నడవిమనిషిని, నాకూ కపటము తెలియదు.

ఖాశా—ఓరి బాబో! ఈత డిప్పుడు ఉషారుగా నున్నాడు—(పైకి) అయ్యా పహారాలన్నీ దాటి లోని కెట్లు రాగల్గినావు? ఎవరికంటా నీవు పడలేదుకదా?

వేట—పహారాలతో పనేమి నాకు? తాడు పట్టు కొని దిగి వచ్చినాను.

ఖాశా—ఈ కొండమీదినుంచే దిగినావా? మంచి సాహసికుడవే. లోగడ హీరా అనే గొల్లపిల్లని ఒక కొండ గుహాలో చెరబెట్టినారట—బురుజుమీదినుండి ఆమె తప్పించు కొని తాడుసహాయమున పారిపోయిందని శ్రీ శివాజీమహా రాజుగారు దాని సాహసమునకు మెచ్చి ఆబుర్జుకి హీరాబుర్జని పేరు పెట్టినారట—నేడు నీవు వరహావతారము ననుకరించి ఈ బురుజుమీదనుండి దిగినావు గనుక దీనికి నేను వరాహబురుజని పేరు పెట్టుతూన్నాను. నీతోడి పరిచయము చేసుకోవడము మేలయింది.

వేట—మేలా! మరీ మేలా!

ఖాశా—నీ పేరు?

వేట—గోవిందు;

ఖాశా—నీ కిల్లూ వాకిలీ ఉన్నవా? లేక శాఖా మృగములాగు చెట్లకొమ్మలమీద వసింతువా?

వేట—శివాయి లోయలో నాయిల్లు—వేట నాకు జీవనోపాధి.

ఖాశా—ఒంటివాడవా? వెనకా ముందూ ఎవరైనా ఉన్నారా?

వేట—నా కెవరూ లేరు.

ఖాశా—నీవు నాకు బాగా నచ్చినావు—ఇక్కడ నాతో నుంటావా?

వేట—ఇంతకన్నా నాకేమి కావలెను? తప్పకుండా ఉంటాను.

( తెరలో—జే! అంబికే! )

ఖాశా—(తనలో) అదిగో కబ్జీ వచ్చినాడు. చిక్కు వచ్చింది. ఒకటి చేయబోతే ఇంకొకటి తారసిల్లింది. కబ్జీ కంట వీడు పడితే అతడు నాగొంతు కోరుకక మానడు. స్త్రీలోలుర కిట్టి చిక్కులు ప్రాప్తిస్తూంటవి. వీని నేమి చేయడము?

( తెరలో—జే! అంబికే! )

మిత్రమా, వచ్చినట్లే పారిపో. కొంతసేపు పోయిన తరువాత వృత్తాంత మంతా చెప్పుతాను.

వేట—పరుగెత్తి పోవడానికి వీ లేదీ?

ఖాశా—ఈ తోవను పో!

వేట—సూటిగా పహారా జవాను చేతిలో పడుమంటావా?

ఖాశా—తాడుందిగా. అది పట్టుకొని పైకి పో.

వేట—పిట్ట ననుకొన్నావా ఎగిరిపోవడానికి? నేనెక్కడికీ పోలేను. నీవన్న ట్లిక్కడే ఉంటాను.

(తెరలో—జే! అంబికే!)

ఖాశా—నాకు మేకు వైనావే! వాడు వాకట్లో గొంతు బద్దలు చేసుకొంటున్నాడు. నీ విక్కడినుండి కదలకున్నావు. మధ్య నాప్రాణాలమీదికి వచ్చినది. ఆ గూటిలో కూర్చో. లేకుంటే ఆరాతిచాటున అగుపడకుండా పడుకో.

(తెరలో జే! అంబికే!)

ఖాశా—జే! భవాని!

(తెరలో—జే! మహిషాసురమర్దనీ!)

ఖాశా—జే! అంబికే!

(తెరలో—జే! అంబికే!)

ఖాశా—(ద్వారము తెరచును. నల్లగుడ్డ మునుగు చేత దివిటీతో కబ్జీ వచ్చును)

కబ్జీ—జగదంబ! జగదంబ! జగదంబ! ఖాశాబా! ఇంతాలస్యమేమి? ఏమి విశేషాలు?

ఖాశా—విశేషా లేమీ లేవు.

కబ్జీ—కుర్రదాని మనసు నావైపు మళ్ళినదా?

ఖాశా—కొంచమైనా మళ్ళలేదు. ఎప్పటిలాగే ఉన్నది. ఈ ప్రసంగము తెస్తే దానినోరు కట్టిపోతుంది పెడమోము పెట్టుతుంది.

కబ్జీ—కానీ కానీ – ఇంకా కొన్నాళ్ళిలాగుంటేనే కాని దీని రోగము చప్పగా కుదురదు. శిర్కేవద్దనుండివార్త వచ్చిందా?

ఖాశా—రాలేదు.

కబ్జీ—పాదుషావారి భృత్యుడు కానీ దూతగాని రానే లేదా? మన గణోజీకి కష్టము రాలేదు కదా? పహరాలు జాగరూకతతో నడుస్తూన్నవా?

ఖాశా—అంతటా అతిజాగ్రత్తతో ప్రవర్తిస్తూన్నాము.

కబ్జీ—గణోజీ కబురు తెలియలేదు. నా పితూరీవల్ల అతనికి సంశయము పొడమినదా?...జాగీరు నాశించి సంభాజీని మొగలుల కర్పిస్తానని ఒప్పుకొన్నాను. ఈకోరిక కొనసాగే దాకా విఘ్నములు కలుగుతూండును కాబోలు! మహారాష్ట్రప్రభుత్వమును ఉత్పాటనము చేయవలెనని ఎంతో పాకులాడుతూన్నాను. ఈశిర్కే అజాగ్రత్తవల్ల నా ధైర్యమనుతృణమూ కుంగిపోతూన్నది. ఈ దేశమందలి అరాజకమునకు మూలకారణమనిన్నీ సంభాజీ దుశ్చరితములకు సూత్రధారుడననిన్నీ నా పేరు జగమెల్ల మోగిపోతూన్నది-

నాకుట్రలు అచిరకాలమున ఫలవంతములు కాకపోతే ఈ ఖండోజీగాడు నాభరతము పట్టకమానడు.

(తెరలో జే! అంబికే!)

అదిగో గణోజీ వచ్చినట్లుంది. జే! భవానీ!

(తెరలో జే! మహిషాసురమర్దనీ!)

జే! అంబికే! (తెరలో జే! అంబికే!)

(ఖాశాబా తలుపు తెరవగానే ఇద్దరు వ్యక్తులు నిండు ముసుగులు దివిటీలతో వత్తురు.)

కబ్జీ—ఎవరది?

గణో—సంభాజీ మృత్యుదేవత! నిరంకుశమైన భోంసలా ప్రభుత్వము పట్టపగలు నిర్మూలముచేయ నుద్యుక్తుడైన గణోజీశిర్కే!

కబ్జీ—గణోజీ! తాల్మి వహించుము! నీదెబ్బ నిరాఘాటమైనది—నేను మాత్రము వారికి ఛత్రమూ చామరమూ పట్టి అర్చిస్తున్నా ననుకొన్నావా? భోంసలా ప్రభుత్వము బూడిదెలో కలపవలెనని మన కందరికీ అభిలాష ఉన్నది. నీ వొక్కడవే తత్కార్యావిష్టుడవు కానక్కరలేదు.

గణో—ఆవేశము వద్దంటావా? నే నాగలేను. నా శరీరము ఆపాదమస్తకము కోపాగ్నిచేత మండుతూన్నది. ఈ రాజాధముడు నా వంశమంతా నాశనము చేయుడము నేను ప్రత్యక్షముగా చూసినాను. అదెట్లు మరువగలను? నా ఆప్తుల కళంబములు "పగబట్టి, కసిదీర్చుకో" అని అను

తుణముగా నా చెవులు బద్దలవునట్లు మొగపెట్టుతూన్నవి— అభ్యంతరగృహము చేరేసరికి సౌభాగ్యచిహ్నములు లేక నిరంతరశోకాస్పదములైన మొగములతో బాష్పవృష్టి వర్షింప చూసి ఎట్లోర్వగలను? మూవాళ్ళ బొబ్బలు వింటే మతిపోయి తల పగిలిపోతుందనిపిస్తూంది. పరిస్థితులిలాగుండగా ఆవేశ మనవసరమంటావా?

కబ్జీ—నే ననేదిగి కాదు. మీవంశము నిర్మూలమయింది. ముసలివాళ్లూ ముద్దులొలుకు ముగ్ధబాలురూ బాలికలూ కూడ తెగనరుకబడ్డారు. మీ మేడలలో దీపము పెట్టు దిక్కులేదు... ఇవన్నీ వేరే చెప్పనక్కరలేదు. మీ జాగీరు తలుచుకొంటే దాని నన్యాయముగా అపహరించిన భోంసలే వంశము నీవు నిర్మూలము చేయలేకపోతే వీరులకు పుట్టిల్లైన శిర్కేవంశమందు మగవారు మిగులనే లేరని లోకమంతా భావిస్తుంది; రేపు మేమే అంటాము... నీవు చేయవలసిన కార్యము ఘనమైనది. దాని నతిజాగ్రత్తతో సాధించుకోవలెను. కడుపులో కాలాగ్ని రగులుతూన్నా ముఖమందు మొలకనవ్వు తాండవమాడవలెను. ఇప్పుడే అల్లరిచేస్తే ఈ అరాజక మభివృద్ధి చెందదు.

గణో—ఆమాట నిజమే. ఇంక పల్కులవల్ల ప్రయోజనములేదు, పని కానవలెను. భోంసలా వంశనిర్మూల మయినప్పుడే నా ప్రతాపము ప్రకటిత మవుతుంది.

కబ్జీ—అదీ మాట—మీ గీవంశము నిర్మూలించవలసినదే—నేనా నాచేత నైన సాయము చేస్తాను. ఖాశాగా! దివిటీ తీసుకొని పో—చంద్రావళిని దూరముగా నుంచు. (వాడలాగు చేయును) మీరు రావడ మాలస్యమయిందేమి? (క్రొత్తవానిని చూపి) ఇతఁ డెవఁడు?

గణో—మన యత్నములు కనిపెట్టి వీలైన సాయము చేయవలసిందని పాదుషావారు పంపిన శూరశిఖామణి—ఇక్లాస్ ఖాన్.

కబ్జీ—మంచిమాటే... అహా! పాదుషావా రేమి నిశ్చయించినారు?... వారికి నావృత్తాంతము సవిస్తరముగా మనవిచేసుకొన్నాను. సంభాచారియైన సంభాజీని వారి కొప్ప చెప్పుటకూ అందుకుగాను నాలుగు పదిలక్షల రాబడి గల జాగీరు ఢిల్లీప్రాంతమున వారు నాకు బహుమతి చేయుటకూ ఒడంబడిక అయింది. ఆపైని పాదుషావారి చిత్తము నా భాగ్యము. రాయగడము శత్రుని ర్భేద్యము కావున దీనికి పంచక్రోశము లోగా నా కార్యము సాధించడమునకు వీలుండదు.

గణో—కార్యము నెరవేరిననాటిమాట చెప్ప డెందుకు? నిన్నెలాగు గౌరవిస్తారో పాదుషావారి ఖుషీ...మన మిప్పు డాలోచించవలసిన దేమంటే—సంభాజీగారిని పట్టి యిచ్చినందుకు పదిలక్షలజాగీరు అడుగడము భావ్యమా?

కబ్జీ—రాజకార్యములలో ఆరితేరినవారు మీరు... నే నడిగిన దెక్కువని మీ అభిప్రాయమా? సంభాజీ సాధా

రణ రాజని మీా రెంచకండి. మహారాష్ట్రమంతటికీ నిరంకుశాధి కారి. అతడు చేతచిక్కితే కోటిరూపాయిా లాదాయము గల రాష్ట్రము పాదుషా వారికి లభిస్తుంది—రక్షణాపథమంతా వారి కవుతుంది. ఇంతలాభము వారికి చేకూర్చినందుకు పది లక్షలు బహుమాన మడుగకూడదా?

గణో—సంభాజీని మహారాష్ట్రసార్వభౌమునిగా నెంచితే అతని వెల అనంతము. వెలలేని దానికి వెలవేయ గలమా?...తప్పతాగి తనకు తోచినరీతి వ్యవహరిస్తున్న ఆ నరాధముని సార్వభౌమునిగా నెంచతగదు.

కబ్జీ—మన దృష్టికి సంభాజి చచ్చురాజు కావచ్చును కాని లోకమంతా అతనిని సమర్థుడనే పరిగణిస్తారు...నేటికి దాదాపు పదేళ్లనుండి పాదుషాగారి కత్తినెత్తి, అసంఖ్యాకములైన రోహిలా పఠాను సైన్యములతో ఏకధాటిని పోరాడుతూ, నలుదెసల మరాఠాబల్లెమును తిప్పుతూన్న సంభాజీ బాహుబలము ఔరంగజేబు నెదుర్కొనడానికి జంకేటంత దుర్దశకు రాలేదు...గణోజీ...మంచి ముత్యాలసరము సడలినంతమాత్రాన దాని వెల తగ్గితే, తలమాసినవాళ్లంతా తనువులు ముత్యాలతో నలంకరించుకొందురు. ఎంత కాంతిమాసినా ముత్యము ముత్యమే; నిరంకుశుడైనా రాజు రాజే. అట్టి మహనీయుని ప్రాణము పాదుషా అరచేతిలో పెట్టినప్పుడు పది లక్షలపారితోషికము పాడికాదా?

ఇక్లా—సంభాజీని చంపవలెనని పాదుషావారి కోర్కె కాదు.

కబ్జీ—ఖాన్‌సాహెబ్‌గారూ! నిసర్గశూరులకు నిధనము నిరతిశయసౌఖ్యదాయకము. అవమానము చావుకన్న అధమము. పాదుషాచేత చిక్కిన సంభాజీ ప్రాణాలతో బైటపడుతాడని ఎవరు చెప్పగలరు? సంభాజీ చస్తే నాకేమి? శిర్కే, నీవేమంటావు?

గణో—కబ్జీ, నిపక్షము నీవు విశదీకరించినావు. సంభాజీని తనవశము చేయవలెనని పాదుషావారు పట్టుబట్టడము దక్షిణాపథమంతా సంక్రమించుకోవలెననే ఊహతోనే అని అందరూ ఎరిగినదే! రాయగడమునుండి ఐదుకోసుల దూరమునగాని తనకార్యము నెరవేరదని చెప్పుతూన్నావు. అలాగైతే పాదుషావారికి దక్షిణాపథము దక్కదు. భోంసలా వంశ మూలగోపాలము పాదుషావారి పరమైతేనే వారి కోర్కె నెరవేరగలదు. కబ్జీ చేతన్నన్నపని మతితప్పిన మహారాజు నొక్కనినే పట్టియివ్వడమే. రాయగడము కూడా స్వాధీనము చేస్తే పదికాదు పాతికలక్షల జాగీరైనా కోరవచ్చును. ఒక్క సంభాజీ తలకు పదిలక్షలవసరము లేదు.

కబ్జీ—అయ్యా, ధనాశకు లోపడి తలకు తగనిపని చేయజాలను. చేతకాని పరుగులకు పోయేవాడను కాను, నన్ను మీరు వీరుడన్నా సరే, భీరుడన్నా సరే.

గణో—అలాగైతే పదిదాకా పరుగెత్తకు. కొంచెము తగ్గు.

కబ్జి—నేను తగ్గను. సంభాజీ నా కేమిలోటు చేసినాడు? ఇరవై ఏళ్లనుండి ఈ రాష్ట్రములో నున్నాను. ఏదో రీతిని ప్రభువుపజ్జను చేరి పరపతి సంపాదించినాను—నే నాడిన దాట, పాడినది పాటగా నుండె. రాజ్యతంత్ర మంతటి గుట్టూ మట్టూ నే నెరగనిది లేదు. నా కేవిధమైన లోపము రానివ్వ లేదు. దేనికోసము కదా ఎంగిలి తినడానికి సిద్ధపడ్డాను. ఈవ్యవహారములో ఒకజాగీరు చిక్కితే నా దేశము పోయి హాయిగా పుత్రపౌత్ర పారంపర్యమూ ఎందునా లోపము లేకుండా జీవనయాత్ర గడుపుకొంటాను. కానికూడు తిన్నా కడుపు నిండకపోతే ఏమి ప్రయోజనము? ఆశాపూర్తి కాక పోతే పాదుషావారి ప్రాపుకై పాకులాడడ మెందుకు? ఇక్కడ నాకు ప్రాప్తించినదే పదిలక్షలు. అది తగ్గిస్తే ఇంకేముంది?

ఇఖ్లా—పాదుషావారు కార్యవాదులు గనుక మీరు కోరినంతా మీ కిస్తారు. అయినా గణోజీ చెప్పినట్లు మీరు కొంచెము తగ్గడమే మేలు. మీ కోరిక సుకర మౌతుంది.

కబ్జి—అట్లు వీలులేదు. ఇదేమి కూరగాయల బేరమా? మహామండలాధిపతిని మభ్యపెట్టుచుట సులభకార్యమా? ప్రాణోపద్రవకరమైన పని; ఏమాత్రము గురితప్పినా సర్వ నాశమే కదా?

ఇఖ్లా—గణోజీ! ఏ మంటావు?

కబ్జీ—నేను బైటికి పోతాను, మీరాలోచించి ఏదో నిశ్చయించండి...(వెళ్లుతూ) నేనుతప్ప మీకు గత్యంతరము లేదు. సూర్యాజీని కారాగారమున భద్రపరిచినాను, అది మీకింకా తెలియదు. (పోవును)

ఇక్లా—గణోజీ—ఈమూర్ఖుడు భల్లూకపు పట్టు పట్టినాడే!

గణో—వాడి వేలుతో వాడికన్ను పొడుద్దాము. ఇప్పుడీమగతు ఒప్పుకొందాము—నేను పాకులాడింది జాగీరుకోసము కాదు, రాయగడము కూడా దక్కుతుందేమో అని ఆశపడ్డాను—అది వీడిచేత కాదు.

ఇక్లా—గణోజీ! నీకు మతిపోయి నట్లుంది. పదిలక్షల జాగీ రివ్వడానికి పాదుషావా రొప్పుకొంటారా? పదివేలన్నా నాకు సంశయమే.

గణో—ఈ మొండివాడు మనమాట వినడు. మన మేమి చేయగలము?

ఇక్లా—గొడ్డుగలవాడు గొడ్డుకేడిస్తే గొడారివాడు తోలు కేడ్చినాడట. నీకు పగదీర్చుకోవలెనని ఉంది—సంభాజి పాదుషాపర మైతే నీకోర్కె సిద్ధించదని నీగోల! వీడి అవసరము వచ్చిందని వీడు కోర్కెకోరినాడు—కాస్తా కూస్తాకాదు—పదిలక్షలజాగీరుకి ఫైసలుచేసినా నంటే నా ప్రాణాలు తీసివేయరా పాదుషావారు? వారి అనుమతి లేక నేనేమీ చేయలేను.

గణో—సమయానికి పాలకుండలో పటిక వేస్తారా? నిమ్మాశ్రయించినందు కిదా ఫలము? నాయత్న మంతా వ్యర్థము కావలసినదే?

ఇక్లా—వ్యర్థమేమి? సూర్యాజీ ఉన్నాడంటివిగా, వాడి మూలాన కార్యము సాధించు కొందాము.

గణో—అది పట్టిభ్రమ. వా డీపని చేయలేదు—ఇం కోటి—ఈకబ్జీ బ్రాహ్మణుడే కాని అతి నీచుడు స్వార్థపరుడు. వాడిని తోసివేసి మనము యత్నముచేస్తున్నామని తెలిసినదా మనకార్య మవశ్యము చెడగొట్టి తీరుతాడు. మనగుట్టు వీడికి తెలిసింది—ఎంతో కొంతకు ఫైసలుచేయడమే యుక్తము... కార్యార్థియైనవాడు గాడిదెకాళ్లు పట్టుకోవలసి వస్తుంది—ఇంకోమాట. సంభాజీ మాకులము ధ్వంసము చేసేటప్పుడు వీ డతనికి సహాయభూతుడై నాడు, కనుక నాశత్రుకోటిలోని వాడే వీడు. సంభాజీని మనకు వీ డప్పగించినవెంటనే వీడిని నే నంత మొందిస్తాను. పాదుషా జాగీరివ్వ నక్కరలేదు, నాచేతి చావే వీడి జాగీరు. కనుక నామాట విని ఒప్పుకోండి.

ఇక్లా—సరే—అందుకు నా అభ్యంతరము లేదు. కబ్జీని రమ్మను. (గణోజీ కబ్జీలు వత్తురు.)

గణో—కబ్జీ—నీమరణులు కొప్పుకొన్నాము.

ఇక్లా—ఇకను పోదాము. ఈ ఏర్పాటు సాధిస్తే కదా? కబ్జీ, సంభాజీని ఎప్పుడు ఎక్కడ ఏరీతిని మాకు స్వాధీనము చేస్తావు?

కబ్జీ—రేపు కోట వెడలిస్తాను. పాదుషాగారి సంతకమూ మొహరూ ఉన్న దానపట్టా నా చేతిలో పడగానే అతనిని మీకు స్వాధీనము చేస్తాను. ఇక మీకు సమ్మతమేనా? సరకు నాకందేదాకా సంభాజీకూడ మీకు తెలియనివ్వను. ఇదీ మునస్తారికీ నిశ్చయము.

గణో—సరే. ఇక మాకు సెలవు. సాహెబుగారూ, దయచేయండి. చంద్రోదయము కాక ముందు మన మీ కోట దాటి పోవలెను.

కబ్జీ—వారిని పంపి నేను కూడా రాయగడముకు పోవలెను. ఖాశాబా! దవిటీ మశాలు (అందరూ బైటికి పోవుదురు)

సాహీ—కబ్జీ! నీచా! బ్రాహ్మణుని గర్భవాసాన ఎట్టి చండాలుడవు పుట్టినావు! అపరాయికుడా, సంభాజీ మహారాజు నీకు పాలుపోసి పెంచినందుకు కాలసర్పము తీరున అతనినే కరవదలచినావు. ఏ జన్మానో పగబట్టి ఇప్పుడది తీర్చుకోదలచి మా ప్రభువును నీ వాశ్రయించినట్లుంది. ఎట్టి క్రూర గ్రహమైనా కొన్నాళ్లకు రాశి మారితే సౌమ్యమవుతుంది కాని నీవు మహారాష్ట్రకులమునకు ధూమకేతువువై చలనము లేక నిల్చియున్నావు. నా భార్య చెర విడిపించవలెనని ఇక్కడికి వచ్చినాను. ఇట్టి పరిస్థితులు నా దేశమునకూ నా ప్రభువుకూ సర్వనాశహేతువులు. మహారాష్ట్ర ప్రభుత్వ మంగళి గుట్టూ మట్టూ ఎరిగిన విశ్వాసఘాతకుడైన కబ్జీ

దురంతముచేత భ్రాంతుడై సుఖనిద్ర చెందుచూన్న సంభాజీని మహారాష్ట్రమును కూడా కబళించవలెనని పాదుషా కాచుకొని ఉన్నాడు—ఈ మహోపద్రవమునుండి నారాజునూ రాష్ట్రమునూ కాపాడకుంటే నాబోటి కృతఘ్నునకు పట్టెడన్నము పుడిసెడు నీరు దొరుకునా?

చంద్రా—నాధా!

షాహీ—(ఊరకుండును)

చంద్రా—పలుకవే ప్రాణకాంతా! వియోగదుఃఖము చేత తపించబడుతూన్న నన్ను నీ మౌనము చేత దహించెదవేమి?

షాహీ—నాకొరకు ఇన్ని పాట్లు పడుతూన్న నీతో ఏరీతి మాట్లాడగలను! నీదుఃఖముపశమింపజేయలేని అసమర్థుడను—కాలము అత్యంత ప్రతికూలము.

చంద్రా—నాదుఃఖము బాపవలెనంటే మీారసత్యవాగులు కావలెను—నాకొరకు మీరాకులాచారము కూల్చవద్దు—మనస్సు రాయిచేసుకొని ఏదో తీరున ప్రాణాలు బిగపట్టుతాను.

షాహీ—పూచినపువ్వులన్నీ దేవతార్చనకే వినియోగించడానికి వీలులేదు. ఫలినాశకని దాపురించడము వల్ల మన కీకష్టములు ఘటిల్లినవి—భగవంతుడు ప్రసాదించినదంతా మనమేలుకే అని దృఢముగా నమ్మి సంభవించిన కష్టములు సహిస్తూ గుండె దిట్టము చేసుకో.

చంద్రా—ఈ వాక్పుష్పములనే మీా ఉపదేశ ప్రసాదము నాపంచప్రాణములనే దోసిలితో స్వీకరించి శిరసావహి

స్తున్నాను. ఐనా జీవము బాసి దేహ మిన్నాళ్లు మనగలదు? విరహానలముచేత దగ్ధమానముం దేమో అని భీతి కలుగుతూన్నది.

షాహీ—నే నిప్పుడు చేయబూనుకొన్న కార్యము అత్యంత ప్రమాద జనకము—ఇందు విజయము చేకూరిందా మన మదృష్టవంతులమే. అపజయము గాటిల్లి నాకు ప్రాణహాని సంభవించెనా...

చంద్రా—సహగమనము చేస్తాను.

షాహీ—మేలైన పని. కొంతకాలము నీవు చెరలో నుండక తీరదు. నీవు పంచాగ్నిహోత్రమధ్యమున నున్నావు. అందరూ దుర్జీవయూగ్నికి నిన్నాహుతిచేయవలెనని సిద్ధముగా నున్నారు. దీని నాధారము చేసుకొని కబ్జీని నామావశేషునిగా నీవు చేయవలెను. లేకుంటే సాదుసాప్రభావ మనే తేనెపూసిన కత్తిపదును గుచి సంభాజీ మహారాజుకు చూపి గణోజీ తన పగతీర్చుకోక మానడు.

చంద్రా—ప్రాణేశా! నేను వీరపత్నిని—ఐదుగురు కాదు ఐమువందలమంది నన్ను చుట్టుముట్టినా నా మానము కాచుకోగలను. ఒకవేళ అట్లు చేయడము అసంభవ మని తోచెనా నా ఒడ్డాణము నాగొంతు కోయగలదు.

షాహీ—సరే—అజ్ఞురాలవు కావు. యోగ్యాయోగ్య విచక్షణ చేసి యుక్తరీతిని నడుచుకో పోయి వస్తాను.

(తెరదిగును)

---




# రెండో అంకము

## మొదటి రంగము

రహస్యాలోచనా మందిరములో సర్జాఖా

సర్జా—నన్నొకమూలకు తీసుకొనిపోయి ఖాశాబా రెండుచెంపకాయలు కొట్టినా అవమాన మనుకోను—చంద్రావళిముందర నన్నిసడించినాడు, అందుచేత నాఒళ్లు మండుతూన్నది—నాయందు దానికి గౌరవ ముంటుందా? చంద్రావళికి నాహృదయ మెరిగించవలె ననుకొన్నాను, కాని ఈముండకొడుకు నాగుట్టంతా దానిముందర బైటపెట్టినాడు. నాకు వయస్సు చెల్లిందట, ఇక నేను రామా కృష్ణా అని జపము చేసుకోవలె నట—ఇది తలచుకొంటే అవమానాగ్ని నన్ను దహిస్తూన్నది—ఆతొత్తుకొడుకుని చావజంపి చెవులు మూసి చంద్రావళి నిక్కడినుండి దాటిస్తాను. ఈ గాడిదె కొడుకు గుడ్లగూబలాగు గుహవిడిచి బైటికి రాకుండా

ఉన్నాడు. లోపలనే ఉంచుదామంటే చంద్రావళి ఉంది— ఏమిసాధనము ?

(ఖాశాబా వచ్చును)

ఖాశా—హా! దైవమా! ఈ సర్జాబా కామినీ భూతములాగు నన్ను వదలకుండా ఉన్నాడు...పడుచువాళ్లు పంచబాణుని బారిని పడడము సహజము; పళ్లుపడిపోయి ఆగోపక ఆసన్నమై కాటికి కాళ్లు చాచిన సర్జాబా కేమి చేటుకాలము వచ్చింది! బెల్లమును చీమ లాగు చంద్రావళిని క్షణమైనా విడువలేకున్నాడు. ముసలివాళ్లకి మోహదాహము కల్గించే మన్మథుడు ఒకసారి కాల్చి మహేశ్వరుడు తిరిగీ బ్రతికించినందుకు శాస్తిగా అతనికి త్రిమీద నెన్ని వంకాయలు కొట్టినా నాకసితీరదు—అట్లు బ్రతికించినవాడు వయస్సుచెల్లినవాళ్ల జోలికి పోవద్దని షరతైనా పెట్టినాడు కాడు—నిన్న ఈసర్జాబాను తిట్టినాను, ధిక్కరించినాను, అవమానపరచి చంద్రావళికి వీనియందు రోత కలిగేటట్లు చేసినాను. నేడు తిరిగీ సత్రమండలి కుక్కలాగు సిద్ధమైనాడు. ముండిగాడిదెకొడుకు శృంగారచేష్టలు చూచి తీరవలెను. ఆయీల, ఆ గొంతుకసవరింపు, కూని రాగము, చెముడు కాకి లాగు ఆ ఎర్రదుస్తులసొంపు! హోయిహోయి! సానివాడకు తగిన వేషము! ఇట్టిది సంపన్నసంసార చంద్రావళిపట్ల సాగునా?...ఎదవోయినగిత్తలా గున్నాడు.

సర్జా—చిక్కినావు చిలిపిముండకొడుకా, నీకు నూరేళ్లూ నిండినవి.

ఖాశా—వీడు నన్ను చంపుతాడు కాబోలు—గోవిందైనా లేడు దైవమా!

సర్జా—పంజాబుపసును బండబారిందా! పలుకవేమి? చావడానికి సిద్ధముగా నున్నావా?

ఖాశా—ఓరి పీనుగా! చావడానికైనా సిద్ధముగా నుంటాడా? నీవంటి మూఢుకాళ్ళ ముసలికూడా మృత్యువు కోరడు, పశువువాడవు నన్ను సిద్ధపడుమంటావా చావడానికి?

సర్జా—అడ్డువచ్చినవాళ్ళని హత్య చెయ్యడమే శూరులకు విధి—నా ప్రేమప్రవాహానికి అడ్డువచ్చినావు, నీ ప్రాణాలు తీయకపోనను.

ఖాశా—ఏదీ చంపు ఆవెనక నా ప్రభావము చూతువుగాని—

సర్జా—ప్రాణము పోయినతరువాత ప్రభావము చూపుతావా?

ఖాశా—అదే నా కిటుకు—బ్రతికి చచ్చినవాళ్లు ప్రాణాల కాసిస్తారు చచ్చి బ్రతికినవాళ్లే సాహసులు.

సర్జా—చంద్రావళి విషయమై నిరాశ చేసుకొంటే నిన్ను చంపను.

ఖాశా—నీ వీలాగనడము న్యాయమేనా?

సర్జా—మారుమాటాడకు—దానిమీఁద ఆశ వదలుకొంటావా?

(కబ్జీ దూత వచ్చును)

దూత—సర్జాఖా!

సర్జా—ఏ డెవడు?...ఎవ రది?

దూత—పారావిడిచి పసిగట్టినా వేమి?

సర్జా—నీ వెవడవు? ఎందుకు వచ్చినావు?

దూత—కబ్జీ పంపగా వచ్చినాను. చంద్రావళిని తోడుకొని మీ రిద్దరూ కొండకిందికి రండి—మూటాముల్లె పట్టుకొని రండి, ప్రయాణము కావలెను.

సర్జా—ఖాశాఖా! ప్రయాణసరంజామా చెయ్యి.

ఖాశా—నన్ను చంపి చంద్రావళిని లోబరచుకోవలె ననుకొన్నావు—మనయిద్దరినోట్లోను బెడ్డకొట్టినాడు కబ్జీ!

సర్జా—కబ్జీతో పని కట్టింది సాయి—త్వరగా సరంజాము కానీ.

ఖాశా—లేడికి లేచిందే ప్రయాణము—సరంజాముకే ముంది?

(పోవుదురు)

## — రెండో ప్రసంగము —

### యేసూబాయి మహల్ — ఖండోజీ.

ఖండో — రాత్రి గడచింది, అంతకంతకూ వేళ మీరుగుతూన్నది. ఇంతవరకు సాహీబుజాదా కానరాదు. ఏమి గందరగోళము జరుగుతూన్నదో? పితూరీ మూలమున్నట్లుగా కనుక్కో-వలెనని రహస్యమందిరములో దాగినాడో కబ్జీచేతులలో చిక్కినాడో? ఇదే నిజమైతే మేమిద్దరమూ దగ్గర లేకపోవడము చూసి కబ్జీ కార్యము సాధించుకొంటాడు. ఈ గడబిడలో ఎప్పుడేది జరుగుతుందో చెప్పలేము. ఆసన్నములైన ఆపదల కంటె ఆసన్నము కానున్న అరిష్టములే మిక్కిలి భయావహములుగా కనబడుతూన్నవి. ఈ అరిష్టపరంపరాంతరమున నేమున్నదో ఊహించలేకున్నాను. తుపానులో చిక్కుకొన్న ఓడలాగు చిత్తము సందోళితమౌతూన్నది. ముందూ వెనకా అడుగు పడదు, ఉన్నచోట ఊపి రాడదు. ఎటు చూసినా నిబిడాంధకారము... అయ్యయ్యో ఎన్నో తరములనుండి దట్టముగా అల్లుకొన్న పారతంత్ర్యాంధకారమును నశింపజేసిన మహారాష్ట్రప్రతాపసూర్యు డుదయించి ఎంతో కాలము కాలేదు. ఇంతలోనే అరాజకగ్రహణము ఆసన్నము కావడము చూస్తే స్వర్లోకవాసియైన ఛత్రపతి శ్రీ శివాజీమహారాజావారి కళ్లనుండి అశ్రుధారలు లొలుకవా? హిందూధర్మమును నానావశేషము [illegible]ిన తురకలతో ధర్మ

యుద్ధము జరుగుచువేళ మహారాష్ట్రుల రక్తనాశములును శక్తి ములు నొసగ్గుమని పండరిపుర విఠలస్వామిని ప్రార్థించిన భక్తుల కంఠములు ఖడ్గనిశములు కాకుండునా? ఔరంగ జేబుతో పోరు పొసగినన్నాళ్లు నిర్భయులమైయుంటిమి. అతడు మామొద కత్తి ప్రయోజనకారి కాదని స్వానుభవమువల్ల తెలుసుకొని ఇప్పుడు కపటనర్తనమునకు దిగినాడు. ఆ కూట నీతిపటునితో మా బుద్ధిశాలురు సాటికాక — మా రాష్ట్ర సౌభాగ్యవశమున శ్రీమతి సాధ్వీశిరోమణి యేసూబాయి రాణియైనది—ఇదే మా కీడులో మేలు—అమెమూలాన మా ఆశాంకూరమునకు అవసానదశ ఆసన్నము కాలేదు. (తెరలో) "అన్నా" అని పిలుపు.

ఆఁ. రా అమ్మా! రా! (సంతూబాయి వచ్చును)

సంతూ—అన్నయ్యా! బాగా చేసినావు లే.

ఖండో—ఏదో ఆలోచనలగొడవలో నీ మాట మరచి పోయినాను.

సంతూ—నీ ఆలోచనలు బంగారము గానూ! రాజు గారి మహల్ రాణిగారి అంతఃపురమూ చూపించి మహా రాణిగారి దర్శనము చేయిస్తానని చెప్పి నన్నిక్కడికి తెచ్చి ఒంటిగా విడిచి వెళ్లిపోతావా?

ఖండో—నీ కేమి భయమే? వెర్రిదానా!

సంతూ—భయపడడము నాతప్పా?

ఖండో—తప్పు కాక?

సంతూ—ఏమి చేయగలను? ఎంత ప్రథపడ్చుకొన్నా ఏడ తప్పలేదు. చూడు, నా కాళ్లేలాగు వణుకుతూన్నావో—నేను అసలు పల్లెటూరి దానను, పట్నవాసాల్లో తిరిగే టప్పుడు కొత్తచేత దిగులుగా నుంటుంది... నే నిక్కడ ఉండ లేను; న న్నింటికి పంపించు—రాజుగారి మహాలూ వద్దు, రాణిగారి దర్శనమూ వద్దు.

ఖండో—ఇదేమి మన ఇల్లనుకొన్నావా? మహా రాజుగారి మహల్. గట్టిగా మాటలాడకు.

సంతూ—మహల్లైతే మాటలాడకూడదా? అలా గైతే మన ఇల్లే మేలు.

(యేసూబాయి వచ్చును)

యేసూ—అమ్మాయీ! మా నగరులూ మేలైనవే—నిర్భయముగా మాటలాడు—నీవు జంకవద్దు—నిన్నెవరూ అడ్డుపెట్టరు—ఏమి ఖండో, చిన్నపిల్ల నెందుకూ బెదరిస్తూ న్నావు?

సంతూ—నీమాట లెంతో తీపిగా నున్నవి. నీ వెవరో గొప్ప యిల్లాలవు, మాఅన్న వట్టి గంగిగోవు. వీ డతి వినయ శీలుడు; కాని వీడి నేదో తగనిచింత బాధిస్తూన్నది. మహా రాష్ట్రక్షేమభార మంతా వీడే మోస్తూన్నట్టు భావిస్తాడు. మా తండ్రి గారికి వీడు ప్రయోజకుడు కావడము చూసు కొని ముచ్చటపడే యోగ్యత లేకపోయింది. ఈసంభాజీ

మహారాజే మాతండ్రిగారిమీాద కోపించి సనగశాలికిం తొక్కించినారు. ఆమాట వీరు మరచి తన మనస్ చేయుడు ములో తప్పు రానీయరు. మహారాజుగా ఎంతో మూవాడి కమితభక్తి, గౌరవమూ భయము.

ఖండో—గొప్పవారితో అలాగేనా మాటాడడము? ఊరుకో.

సంతూ—చూసినావా? అమ్మా! నో తత్తనివ్వడు, ఏమి అంటే మహారాజు అంటాడు, మహాలూ అంటాడు. మా రాణి యేసూబాయి మనస్సు చాలా మెత్తని విన్నాను. ఆమె చేరదీసి పెంచింది కనుకనే మానాను ముందరికి వచ్చి నాడు. ఆమెఋణము తీర్చుకోలేము. ఆమె నెప్పుడు చూతునా అని ఉబలాటముతో నున్నాను.

యేసూ—నీమాటలవల్ల వెనుకటిసంగతు లెన్నో జ్ఞప్తికి వచ్చినవి. యేసూబాయిని నేనే.

సంతూ—అమ్మయ్యో! ఎంత ప్రమాదము! మీా ముందర మహారాజుగారిని మాటలాడినాను. నాతప్పు మన్నించండి. మూర్ఖురాలను.

యేసూ—అమ్మాయీ! కలవరపడకు. నీమీాద నాకు కోపములేదు. నిర్భయముగా నిజమాడినందుకు నాకు చాలా సంతోషము. నీవు మట్టపుచూపుకై వచ్చినావని ఖండూ చెప్పినాడు. అప్పటినుండి నిన్ను చూడవలెనని ఉండెను. నీవే వచ్చినావు.

(దాసి వచ్చును)

దాసి—సర్కార్, షాహీ రక్షిరమునస్కుడై వచ్చి ఇప్పుడే దర్శన మనుగ్రహింప వేడుతూన్నాడు.

ఖండో—వెంటనే రమ్మని చెప్పు. దాసీ, ఈమెకు తగిన సాయమిచ్చి మా యింటికి పంపు. అమ్మాయి నీవు వెళ్లు...

యేసూ—దాసీ, ఈమెకు సత్కారము చేసి మరీ పంపించు.

దాసి—చిత్తము. అమ్మాయీ, రామ్మా...

(వెళ్లుదురు)

(షాహీరు వచ్చును)

షాహీ—మోసము! ఘాత! ద్రోహము! సర్కార్, మహారాజుగారికి ఘోరమైన ఘాత సంభవించగలదు. పాదుషాచేత పదిలక్షల జాగీరు పారితోషికముగా ఇప్పించెద నని కబ్జీ కాశపెట్టి మహారాజుగారిని పట్టి యివ్వనున్నాడు గణోజి—కలుషాత్ముడగు వీ డందుకు సమ్మతించినాడు. ఈతని వలలో పడకుండా మహారాజుగారిని మీరు కాపాడవలెను.

యేసూ—అన్నా! ధనలుబ్ధు లెంత అక్రమమైన పని కైనా సిద్ధపడుతారు. గణోజీ! మన మిద్దరమూ ఏకగర్భ జనితులమే. నా ప్రాణనాథునియెడ నీ కింత పగ యెందుకు? రాజుగారిని రాష్ట్రమును సమూలమూ తురకల కప్ప గింతువా? నీవు చేయదలచిన ఈ అకార్యమువల్ల మన

కులమున కెంత అపకీర్తి ఘటించునో ఆలోచించినావు కావు.

ఖండో—అమ్మా! మీ రీరీతి ఖేదాశ్రుధారాపాతము చేత మా మనస్సులు తబ్బిబ్బు చేయకండి. మనస్సు రాయి చేసుకొని మాకు ప్రాపుగా నిలుస్తే గణోజీ కఠారి మహారాజుగారి నంటులోపల ఎంకరమో గణోజి ప్రాణములు తీయ గలము; మీ సౌభాగ్యసూర్యకిరణప్రసారము నిరాఘాటముగా సాగించగలము.

సాహి—ఖండోజీ, మంచిమాట చెప్పినావు. ఇక నాలస్య మెందుకు?

ఖండో—గణోజీ ఒక్కడే కాదు, కబ్జీ ఇంకొకడు. ఆ దుష్టసర్పము మహారాజుప్రాపున చెలరేగుతూన్నది. దాని కోరలు క్షణములో పెరికియుందును కాని మహారాజు గారికి కోపము వచ్చి అంతఃకలహాములు ప్రాప్తించునేమో అని సంశయిస్తూన్నాను. వాడు బ్రతికియున్నంతకాలము మహారాజుగారికి కుశల మసంభవము.

(దాలతి వచ్చును)

ఏమి వార్తలు దాలతీ?

దాల—ఇక్కడికి కోసుదూరమున నున్న మామిడి తోటలోనికి పోదామని తులసి తన యావచ్ఛక్తి వినియోగించి మహారాజుగారిని ప్రోత్సాహపరుస్తూన్నది. కబ్జీకూడా

అదే వనిలో వ్యగ్రుడై యున్నాడు. అనలమున కనిలము తోడౌతూన్నది!

షాహీ—చూచినావా ఖండోజీ! మహారాష్ట్ర ప్రతాపసూర్యుని రాహుకేతువులు గ్రసింప నున్నారు; మనము వారి నంతమొందించి తీరవలెను, రక్తస్రావమునకు జంకకూడదు.

ఖండో—యుద్ధ మాచరించుట కాదు. ఈ దుండగులను బుద్ధిబలముచేత సాధించవలెను. మహారాణీగా రిప్పుడే మహారాజుగారిని సందర్శించబోతే కబ్జీ దూరముగా పోక తీరదు. అప్పు డన్నికష్టములు గట్టెక్కుతవి.

యేసూ—అత్యాదర మాపదనే శంకిస్తూండును. అదేమో కాని లేనిపోని అశుభకార్యసంచయము నా చిత్తమును కలతపెట్టుతూన్నది. ఇప్పటి సంకటములు తొలగుననే ధైర్యము చిక్కకున్నది. మీమాట విన్నాను కాను కదా అని పశ్చాత్తాపము పాల బడుదునేమో అనే శంక బాధించకుండా ఉండేటందుకు మహారాజావారిని సందర్శింప బోతూన్నాను. పైన దైవ మున్నాడు. జగదంబ మనకు క్షేమము చేకూర్చుగాక!

ఖండో—భవానీదేవి ప్రభావమువల్ల మన రాష్ట్రమునకు రానున్న రాయిడి తొలగిపోయినది. మీరు ఖిన్నులు కావలదు. గోబ్రాహ్మణపరిపాలనాపుణ్యము సంగ్రహించిన వారిని దైవ మెన్నడూ ఉపేక్షింపదు. దౌలతీ, యువరాజు

గారని తోచుకోనిరా (అతడు వెళ్లును) యువరాజుగారిని ఎదుట పెట్టితివా వీరియంగలి మమత చేతనైనా మహారాజుగారు ప్రయాణము మానుతారేమో చూతాము. (సాహీంనుతో) రహస్యాలోచనామందిరములోని విశేషములు ఎప్పటికప్పుడు కనిపెట్టుతూ ఉండండి. (తెర వాలును)

---

## మూడో రంగము

### మామిడి తోపు—కబ్జీ

కబ్జీ—ఇంకా సంభాజీ జాడ లేదు. ఇంతవరకూ తులసి ఏమిచేస్తూన్నట్టు? సంభాజీని నేను రాయగడము దాటిస్తానని ప్రతిజ్ఞలు పలికినాను. మహారాణీగారి మహాలులో నేడు జరిగిన గందరగోళముపట్టి నాయత్నము మొదటికే మోసము వచ్చేటట్లుంది. నక్సేలావినావహసందర్భమున ఘటోత్కచుడు కార్యభంగము కావించినట్లు ఖండోజీ నా కపట నాటక మెరిగి అందుకు ప్రతికూలముగా అభేద్యమైన వ్యూహము పన్ని నాప్రాణము తీయనెంచినాడు. నా రహస్యము వీడి కేలాగు తెలిసింది? రాజారామ్ మీద రాజుగారికి మొదటినుండీ అనుమాన ముంది. అందుపైని గణోజీని కోటలో ప్రవేశపెట్టడము అతని ప్రోత్సాహముచేతనే అని చెప్పి మహారాజుగారి కోపాగ్ని ప్రజ్వలింప జేసినాను. ఇప్పుడు మరికొన్ని సమిధలు చేర్చి సోదరుల నిద్దరినీ వేరు చేస్తాను.

అంతట నామాట సరిగా యెక్కడికి పరిగితే అక్కడికి సంభాజీ వచ్చును. (తులసి వచ్చును) కాంతాముల తులసీ! మంచిసమయానికి మన కార్యము సాగిన మహారాజులో మోహావార్ధిని పడియున్నారా? పెద్దమనిషి నీబోటి వనితను నమ్మకూడదు. సుమా!

తుల—పెద్దమనుష్యులు నమ్మకూడదు. నీమాట వేరు (నవ్వుచు)

కబ్జీ—ప్రాణోపద్రవము ప్రాప్తించినప్పుడూ పరిహాసమే?... చేయరాని సాహసము చేసినాను. ఇప్పుడేనా మహారాజుగారిని కోట దాటించకుంటే మనకొంపలు మూసిపోతవి. సుమా!

తుల—నా తండ్రిని పడరాని పాట్లుబెట్టి తుదకు ప్రాణముకూడా హరించిన పాపాత్ముడు సంభాజీ అనాయాసముగా అంతమొందించబడే టప్పుడు క్షణికవిషయసౌఖ్యములలో పడి కంఠమున ఉరి పోసుకొందునా? మనఃపూర్వకముగా నే నెవ్వరికి దక్కేదానిని కాను. ఇంతవరకూ రాజుగారియెడల ముగ్ధలాగు నటించినాను. ఇంకా ప్రౌఢత్వము చూపలేదు.

కబ్జీ—ఇం కెప్పుడు చూపుతావు?

తుల—కోటలో జరిగిన కుట్ర వల్ల రాజుగారి మనస్సు కొంచెము తల్లడ మొందినది. మనసిచ్చి నాతో మాటాడ లేదు. అందుకే అలిగి యిక్కడికి వచ్చినాను.

కబ్జీ—సామ్రాజ్యమునకు హాని సంభవించేటప్పుడు నీ అలుకతీర్చడానికి పాటుపడే బంటు కాను సంభాజీ—అత డెవ్వరినీ మనసారా నమ్మడు. ఎలాగైనా అతనిని వెంటనే కోట దాటించవలెను. మన పన్నుగడ రాణీగారికి తెలిసిందని నీ వెరుగుదువా?

తుల—ఆమె కేలాగు తెలిసింది?

కబ్జీ—సరి స్థిరముగా తెలియలేదు. చూచాయగా అనుమానము తట్టింది. ఎవరిమూలాన సాక్షీ సదో చెప్పజాలను...ఇదిగో అడలిపోవడానికిది అనను కాదు. కష్టమాసన్నమైనప్పుడే కార్యవాది ధైర్యము వహించవలెను.

తుల—సుహారా ఇప్పుడే వచ్చును...సరే కాని, ఆతనిని మాయచేస్తానన్నావదేమిటి?

కబ్జీ—పాదుషా వద్దనుండి పరిలతులజాగీరు సనదు నాచేతిలో తిరిగి పెట్టేదాకా సంభాజీకి ఉత్తుంకబంటిసారాయి పోసి రహస్యమైన చోట సురక్షితముగా దాచి ఉంచుతాను.

తుల—అన్నిపాట్లెందుకు? బైటికి రాగానే పట్టియివ్వకూడదా?

కబ్జీ—కల్లబొల్లి పనులు కబ్జీచేత కావు. గణోజీ కడుపులో కపటముంటే రెండింటికీ చెడుతాను. పిమ్మట చావే గతి, అది తప్పిందా, చిప్ప చేతబట్టి బిచ్చమెత్తవలసి వస్తుంది.

తుల—చిలిపిబుద్ధి శిర్కేకి లేదు. అన్నమాట తప్పే వాడు కాడు.

కబ్జీ—అతడపరహరిశ్చంద్రుడే! ఎవరిపట్ల? అతని జోలికి పోనివాని పట్ల. పగవాడయితే అతను పామువంటి వాడు. అతనికులము సంభాజీ నాశనము చేసినప్పుడు నేనాకుట్రలో నున్నానని గట్టిగా ఎరుగును; అందుచేత నేను పక్కబెదురుతో మసలుకోవలెను, లేకుంటే అపాయము వచ్చునేమో... అదిగో! వస్తున్నట్టున్నది. పక్కకు జారిపో.

తుల—ఇదిగో! దేవివచనము సత్యముకాదని చెప్పి మహారాణీగారు నిన్న రాజారామ్‌గారి చెర తప్పించినప్పటి నుండి మహారాజుగారికి నీపైని కోపము వచ్చింది. రాజారామ్ సూర్యాజీలపై నీవు మోపిన నేరముగురించి బాహాటముగా విచారణ చేయబూని నీ వాదము స్థిరపర్చి నిదర్శనము చూపించుమని నిన్నడుగుతారట. అందుకు నీవు సిద్ధుడవై ఉండవలెను.

కబ్జీ—ఆచింత నీకు వద్దు. రాజారామ్‌పై మోపిన నేరము సిద్ధాంతీకరిస్తానని కదా రాజుగారిని బైటికి రప్పించినాను. ఆమాట మరపించడానికి కావలసినన్ని కైఫువస్తువు లిక్కడే ఉన్నవి. వీటికంటె బలవత్తరమైన సమ్మోహనాస్త్రము నీవు. ఇవన్నీ వ్యర్థము లయినప్పటిమాట కదా నిదర్శనము. నీవు చాటున నుండుము. (ఆమె పోవును. కబ్జీ దూరమున నుండును)

(సంభాజీ వచ్చును)

సంభా—రాజారామ్ మీ కుట్రలో లేడా? ఈమాట నిజమని ఎలాగు నిశ్చయించడము? రాయగడ దుర్గము సురక్షితము కదా, శిర్కేలోను కెట్లు రాగల్గెను? దుర్గాధ్యక్షునికి తెలియకుండా దూరడము దుర్ఘటము. పహారా వాళ్లు ప్రమత్తులైనారా? లేక లంచాలు మేసి మూసిచూపక టూరకున్నారా? ఏది ఎట్లయినా దుర్గాధ్యక్షుని సాయము లేకుండా ఈపని జరిగియుండదు. అందుచేతనే అతడు నా యెదుట పడలేక దొంగవలె నక్కినాడు...ఇక రాజారామ్-అతని తల్లిని కుడ్యస్థాపనము చేయించినందుకు అతనికి నాపై కోపము సహజమే. ఒకవేళ కానందామా? నా గర్భశత్రువైన గణోజీ సంబంధమున్న సూర్యాజీ రాజారామ్‌తోనూ అతని భార్యతోనూ కలిసిమెలిసి నిస్సంకోచముగా తిరగడము చూస్తే రాజారామ్ మీ విషయమున కేవలమూ నిర్దోషి యని నిశ్చయింపరాదు. ఈ పరిస్థితులను పర్యాలోచన చేస్తే దుర్గాధ్యక్షుడూ రాజారామ్—ఇద్దరూ అపరాధులే; వాళ్లని కారాగారమున బంధించడము యుక్తము. రాణీ అభిప్రాయము వట్టి భ్రాంతి. ఇప్పటికి తొమ్మిదేళ్లనుండి నా పరిపాలనము రక్తపాతమే కాని శాంతి లేదు. ఎటు చూసినా శత్రువులతో యుద్ధము, అంతఃకలహము; వీటితోనే కాలము గడిచిపోయింది. అహోరాత్రములు అరణ్యములలోనూ అద్రులయందూ తిరుగుతూన్నాను. అఖండ

సేనావాహినులతో నా రాష్ట్రముపైకి పొంగి పొరలివచ్చిన ఔరంగజేబుబలములు హతము చేసినాను, ఇంకనూ చేయుచున్నాను. నా రాష్ట్రమునకగల ఛిద్రములు చూస్తే నాకు వైరాగ్యము కలుగుతూన్నది, ఉత్సాహ మూడుతూన్నది. కార్యశూరునికి స్వకీయులతో విరోధముకన్న దౌర్భాగ్యముంకొకటి లేదు. ఈబాధ ఎంతకాల మోర్వగలను?... ఈ పోరాటము మాన్పవలెనంటే రెండుపనులు చేయవలెను... చావు తప్పి కాళ్ళకు బుద్ధిచెప్పిన శిర్కేలను చంపవలెను. రాజారామ్‌కు కుట్రతో సంబంధ ముండిన నిదర్శనము చూపవలెను.

కబ్జీ—(దూరమున నుండి) జగదంబ! జగదంబ! జగదంబ!

సంభా—కబ్జీ!

కబ్జీ—మహా ప్రభూ!

సంభా—రాజారామ్ కుట్రలో చేరడము నిజమే కదా? ఇది దేవీవాక్య మేనా?

కబ్జీ—మహా ప్రభూ! ముమ్మాటికీ సత్యమే. లేకుంటే మీతో ఆలాగు మనవిచేతునా? నామాటయందు ప్రభువు వారికి సంశయము పుట్టిందా?

సంభా—మీరు చెప్పినది దేవీవాక్యము కాదని సంశయము లేదు; దానిని అన్వయించడములో మీరు పొరబడ్డా రేమో అని సందేహము.

కబ్జీ—సుస్నాతమైన కార్యనిర్వహణమందు పొరపాటు రాకూడదని కబ్జీ ఎరుగును. ప్రభువుగారివంటి ప్రతిభావంతులయెడ దేవీవాక్యము అసత్యము కానేరదు. అన్వయమందు పొరపాటు జొత్తిగాలేదు. నామాట నమ్మండి.

సంభా—మీ మాటకు నిదర్శన ముండవలెనా? వద్దా?

కబ్జీ—నేడు వింతమాట వింటూన్నాను. జగదంబ, మహిషాసురమర్దని ప్రత్యక్షమై పలికిన పల్కులకు నిదర్శనము కావలెనా? దేవవాణిపట్ల మీబోటి దేవాంశసంభూతులకు సందేహము కలుగవచ్చునా? మహారాష్ట్రధాత్రి మాట అసత్య మగునా? అట్లు నా స్థితులు విధర్ములు తలతురేమో కాని ధార్మికులు, సనాతనధర్మ ప్రతిష్ఠాపకులు, దేవీభక్తులూ ఐన మీవంటివారికి కలాగు స్ఫురించడము కాలమహిమ కాక ఇంకేముంది? భవానీకృపాపరిరక్షితులు మీకు ఆమెయెడ శ్రద్ధాభక్తు లుండవద్దా?

సంభా—భవానీచరణపద్మములయందు మాకు పరిపూర్ణభక్తి కలదు. ప్రస్తుతవాదము భక్తిశ్రద్ధలకు సంబంధించినది కాదు... దేవవాణి మీకు సరిగా అర్థమైనదో లేదో అని రాణిగారనుమానించినారు. అది సహేతుకము కాదని సాధించవలెనంటే మీమాటకు నిదర్శన ముండవలెను. అది లేకుంటే రాజారామ్ కుట్రలో చేరెనని సిద్ధాంతము కానేరదు— ఈవిషయ మాశ్రయాసిద్ధ మైతే రాజారామ్ నిర్దోషి

యవును, అట్టివానిని చెరలో నుంచడ మన్యాయ మగును. ఇది రాణిగారి ప్రతివాదము.

కబ్జీ—పరిపోయింది. అమ్మగారు పూర్వపక్షపాతము వహించి వాదిస్తూంటే వారి నొప్పించడ మేలాగు? కత్తితో సాము.

సంభా—మేము నీ పక్షము వహించియున్నాము. నీ కేభయమూ ఉండదు.

కబ్జీ—అంతమాత్రమున నా కాపద తప్పునా? నీళ్లలో నుండదలచినవాళ్లు చేపలతో వైరము పెంచుకో కూడదు—దేవవాణి స్వతః ప్రమాణము, దాని కెట్టి ప్రత్యక్ష నిదర్శనము కావలెను? ప్రభువువారి వంశములో దేవాంశసంభూతు డవతరిస్తాడని భవానీవాక్య మని వదంతి, దాని కేమి నిదర్శన మున్నవి?...దానిమాట కేమి?...ఇప్పుడు నిదర్శనము చూపించవడము అపరాధులను శిక్షించుటకే కదా? ఆశిక్ష యిప్పుడే విధించగలరు ప్రభువువారు. నా ప్రయాసము వట్టి విడంబనమే.

సంభా—కబ్జీ! రాజెప్పుడూ రాజకార్యనిర్వహణపద్ధతికి వ్యతిరేకముగా వర్తించరాదు—రాష్ట్రపరిపాలన ప్రజానురంజనముపై ఆధారపడి ఉండవలెను. జ్యేష్ఠునకు రాజ్యము సంక్రమించడము శాస్త్రీయము కావున నేను రాజునైనాను. నే నెన్ని హత్యలుచేసినా నాప్రజలు నోరెత్తలేదు. ఇప్పుడు మారాష్ట్రచరిత్రలో వ్యాసఘట్టము వచ్చినది. సతీసాపథ

మును జయించవలెనని తిరుగులేని సైన్యముతో పాదుషా తరలి రానున్నాడు. రాజారామ్ నిరపరాధి యని నా ప్రజలలో కొందరు ప్రమాణము చేస్తూన్నారు. ఇట్టివేళ మన అభిప్రాయము సహేతుకమని స్థాపింపకుంటే మనవారియందు దైకమత్యము చెడి ప్రజలకు ప్రభువునెడ రోత పుట్టును. అప్పుడు రంధ్రాన్వేషణ దక్షులగు శత్రువులు మన రాష్ట్రము మట్టిలో కలుపడము...సుకరము...కావున ప్రస్తుతవాద ప్రతివాదము యథావిధిని విచారణచేసి అపరాధులను శిక్షించడమే యోగ్యము.

కబ్జీ—నిజమే కాని, బలవంతులతో వైరము తెచ్చుకోవడము భావ్యము కాదు. పదిమందితో బలహీనులు పగ సాధించలేరు. మీ పరిపాలనములో వైపరీత్యములు కలుగడము విధివిలసితము. ఈయవస్థ కడు శోచనీయము. ఇందుకు ముఖ్యహేతువు ప్రభువువారికి పగులయందూ ఆప్తులయందున్నూ పరమవిశ్వాస ముండడమే...ప్రస్తుతవిషయమున ఒక్కమాట చెప్పకతీరదు, నా కిష్టములేదు, ప్రభువువారికీ రుచించదు...“స్త్రీబుద్ధి ప్రళయాంతకము”—అమ్మగారు చతురలే; అపర జిజాబాయి అన్నా అతిశయోక్తి కాదు. కాని “ప్రమాదో ధీమతా మపి” అన్న వాక్యము పురుషులతో సమముగా స్త్రీలయెడ కూడా వర్తిస్తుంది. మహారాణీగారు సహజముగా బేలలు కావున పురుషుల గభీరత కనిపెట్టలేరు. రాజకార్యనిర్వాహణమందు స్త్రీల సలహా ఎంతవరకూ పాటించ

వలెనో ప్రభువువారే నిర్ణయించుకోవలెను. నాబోటి మంత్రి బుద్ధులందు తలదూర్చకూడదు.

సంభా—కాజీగారి మెడలు మేము ఏలాగు వ్యవహరించ వలెనో నీవు చెప్పనక్కరలేదు. అధిక ప్రసంగమునకు జోగ బోకు. నేరము మోపినవాడు నిదర్శనములు చూపనక్కర లేదా?

కబ్జీ—ప్రతీదానికీ ప్రత్యక్షనిదర్శనము లుండునా? అతిమానుషవిషయములు అస్మదాదులకు గోచరించునా? ఎద్దూ ఎద్దూ పోట్లాడి మధ్య లేగదూడకాళ్లు తొక్కినట్లుంది నాగతి.

సంభా—నీకీపాటి వివేకము లేదని నే నెంచలేదు. చూడడానికి పెద్దపులిలాగున్నావు, తీరా పనులోనికి పిల్లివి. సామంతులతో వ్యవహారము సామాన్య మనుకొన్నావా? నోటికి వచ్చినట్లు నుడువరాదు.

కబ్జీ—ఈ దీనుడు తనబుద్ధికి తోచినట్లు రాజ్యక్షేమమునకు పాటుపడగలడు కాని అంతకన్నా ఏమి చేయగలడు? నాయందు ప్రభువువారికి నమ్మిక లేకుంటే నాకు సెలవు దయచేయండి, నా దేశమునకు పోతాను.

సంభా—నీమూలాన ఎన్నో గృహచ్ఛిద్రములు పెరిగి రాజ్యమంతా ఆరుమూడు కాబోతూన్నది. ఇప్పుడు నీవు దేశమునకు పోతావా? నా అరిష్టము లనుక్షణమూ పెరిగి పోతూన్నవి, నిన్న సూర్యాజీని కొట్టించడమువల్ల అపకీర్తి

అతిశయించింది. ఈయువస్థ మా స్వే రాజ్యపాలనమునకు జోత పెట్టి సన్యాసము పుచ్చుకోవలె ననిపిస్తూన్నది – ఛత్రపతి శ్రీశివాజీమహారాజుగారికి జ్యేష్ఠపుత్రుడనై జన్మించడము నా పుణ్యఫలమని లోకు లనుకొందురు గాక, అది నా పాప పరిణతి అని నా కనుభవసిద్ధ మయింది.—తండ్రిగా రున్న ప్పుడే కారావాసము, వారు తరవాతనుపిస్తుట అష్టప్రధానులతో వైరమూ, అంతఃకలహములూ, నాటి నుంచి అపకీర్తిపాలు కావడమూ, మొదట చిత్తశాంతికోసము కాస్త మద్యము పుచ్చుకొని అందు కాలక్రమమున మితిమీరి తాగుబోతునై ఇంటావంటా లేని చెడ్డపేరు తెచ్చుకోవడమూ, మావాళ్ల యందు నమ్మకము చెడి ఊరూపేరూ లేని పరాయి విశ్వసిస్తే వాళ్లు సమయానికి కాళ్లు సాచడమూ...ఇవన్నీ పాపఫల ములు కాక వేరేమున్నది?

కబ్జీ—మహాప్రభూ! మహాధైర్యశాలులైన మీరు ఈరీతిని...

సంభా—కబ్జీ! నీపాగడ్త లిక చాలించు—నా ప్రాణము నకు నీ ప్రాణ మడ్డువేస్తానని నమ్మించి కార్యము మించినప్పుడు కాళ్లు చాచినావు—ఇక నీమీద ముందటి నమ్మకము చెడి పోయినది.

కబ్జీ—మహాప్రభూ! ఒక అల్పవిషయమున జంకినా నని నా యావద్వృత్తమూ శంకింతురా? కానీయండి—నా

గ్రహాచార మట్లుంది. విశ్వసనీయుడైన మీ సేవకుడు మీ క్షేమమునకు ప్రతికూలించునా ?

సంభా—ఇంతవరకు నా కట్లు తోచలేదు. ఇప్పటి కుట్రలో మునిగి బేజారయిన చిత్తముతో నున్న నన్ను నా దుర్గతికి విడిచి బైటికి దాటవలెనని ప్రయత్నిస్తూన్న నీపై విశ్వాస మెట్లుంచగలను ?

కబ్జీ—ఇట్టి దుస్థితి దాపురించినది కావున మహిషాసురమర్దనిమహామంత్ర సిద్ధిచేత అపరాధులపై నేను మోపిన నేరమును సహేతుకముగా స్థిరపరచుటకు సిద్ధుడను. మహారాణీగారి మాటయందు మీకు దృఢమైన నమ్మిక కుదిరింది కావున మీరు ప్రసన్నులై నామనవి నొకదానిని చిత్తగించ కోరుతూన్నాను.

సంభా—నీవు చెప్పదలచినది యోగ్యమైతే నా ఆటంకము లేదు. నేరము స్థిరపరచడమే నాకు కావలసినది.

కబ్జీ—అయోగ్యమైన షరతు లడుగువాడను కాను. నామనవి చిత్తగింతునని మీరు వచనబద్ధులు కావలెను.

సంభా—సరే, షరతు లేవి ?

కబ్జీ—నేను చూపినచోటున నా మంత్రము సిద్ధించే వరకూ ప్రభువుగారు ఆగవలెను, ఆచోటు మూడోవారికి తెలియకూడదు. మీ అంగరక్షకులకొరకు విశ్వసనీయులైన యోధులను నియమిస్తాను.

సంభా—మంచిది; నీవు చెప్పిన ప్రకారము కార్య క్రమము నడువనీ. నామాటే ప్రమాణము; గుర్రములు తెప్పించుము.

కబ్జీ—చిత్తము. సేవకా, గుర్రములు సిద్ధపరుచు. (గ్లాసు నింపి) ఇదిగో దేవీ ప్రసాదము. తులసీబాయిని వెంట తీసుకొని పోదామనా?

సంభా—ఇట్టి విలాసవతి వెంట నుండవలసినదే.

(యేసూబాయి, యువరాజు, ఖండోజి వత్తురు.)

యువ—కబ్జీ! మహారాజుగారి కిప్పుడు నీవే మిచ్చినావు?...అమ్మగారు వస్తూన్నారు,...బైటికి తొలగి పో...కదలవేమి?...మహారాణిగారు వేచియున్నారు, వినబడ్డదా? నడువు...మహాప్రభూ! వందనము. అమ్మగారు దర్శనముకై వచ్చినారు.

సంభా—సరే—యువరాజా! కబ్జీవంటి గౌరవనీయు డుండడానికి రాణిగారి కభ్యంతర మేమి?

యువ—ఎంత గౌరవనీయుడైనా విదేశీయుడు పైవాడూ కావున వారు బిడియపడుతూన్నారు. ద్వారమువద్దనున్నారు.

కబ్జీ—యువరాజుగారి చిలకపలుకులు నాచిత్తమున కానందదాయకములుగా నున్నవి.

యువ—కబ్జీ! మా మాట వినవా?

ఖండో—ఏమి నీ అవిధేయత? మహారాజుగారికి

మతిక్రమించి యువరాజుగారిని మహారాణిగారినీ ధిక్కరించే టంత నిర్లక్ష్యమా! వారియన్నము తిని వారిసేవ చేస్తూన్న నీవు ప్రభువులనే సరకుచేయకున్నావు! స్వార్థపరతచేత కన్నులు పొరగప్పెనా! నేటి యువరాజు రేపటి మహారాజని మరచినావా! చిన్న మొక్కలే కదా గొప్పవృక్షములవుతవి. యువరాజుగారియెడ ఉదాసీనత చూపుతావా? మహారాజుగారిది దాపుండడముచేతనే నీకు మనుగడ కల్గినది. లేకుంటే ఈ విధేయతకు నీ కపాయము చేకూరవలసినదే.

కబ్జీ—ఖండోజీ, నీ స్వామిభక్తికి చాలా సంతోషించినాను. ప్రభువుగారి ఆజ్ఞాబలముచేత నే నిక్కడ నిల్చినాను గాని మహారాణిగారియెడల మర్యాద నెరుగక కాదు. తొందరపడినావు. నీ కేల ఉలుకు?

యేసూ—నేను వచ్చినా నీవు నోరు సన్నద్ధముండ వలసినదని మహారాజుగారు నీ కాజ్ఞాపించినారా?

సంభా—అనతిచ్చినది మేమే. కబ్జీవంటి స్వామిభక్తుని యెదుట పడడాని కెవరూ జంకనక్కరలేదు.

యేసూ—సరే ప్రభుచిత్తము. ఇదే వస్తూన్నాను. (ముసుగు తీయును) ఖండోజీ, కబ్జీవంటి ప్రభుభక్తుని దూరాడినందుకు క్షమ యాచించు.

యువ—ఏమి యీ విపరీతన్యాయము.

యేసూ—(ఊరకుండు మని యువరాజుకు సంజ్ఞ చేయును)

ఖండో—కబ్జీ! మీబోటి స్వామిభక్తుని తొందరపడి నిందించినందుకు నన్ను క్షమించండి—(నమస్కరించును)

యేసూ—నేను మహారాజుగారితో మాటలాడవలసియున్నది, కావున మీ రిద్దరూ క్షణమాత్రము బైటికి వెళ్ళండి ఇప్పుడే రావచ్చును.

కబ్జీ—మహారాజావారి యాజ్ఞ?

సంభా—కబ్జీ మా చెంత నుండవలసినవాడు.

యేసూ—ఏమి వైపరీత్యము! మహారాజుగారు కబ్జీని మాకన్న గొప్పచేస్తున్నారు! ప్రభూ! సేవకునియెడ పక్షపాతము వహించి మీ అర్ధాంగి నవమానిస్తారా? ఇట్టి ప్రసంగము మీనోట సహజముగా వచ్చేది కాదు. కబ్జీ! మహారాజుగారు మైమరచి యున్నారు. ఇప్పుడు వారి యాజ్ఞయే ప్రధానమని ఎంచక నామాట చెల్లించి కొంచె మావలకు తొలగండి.

సంభా—వద్దు—కబ్జీ బైట పోవద్దు. మహారాణీ! నీవు అసమయమున వచ్చినావు. కబ్జీతో కొంత కాలక్షేపము చేయ వలసిఉన్నది. కావున యువరాజును వెంటబెట్టుకొని నీవు నగ రుకు పోవుట శ్రేయము. నే నిప్పుడే వస్తాను.

యేసూ—మీ రక్కడికో ప్రయాణ మగునట్లుంది. కబ్జీతో మీ రెక్కడి కేగనున్నారు?

కబ్జీ—ఊసుపోలేదని వేటకు పయనమైనారు మహా రాజుగారు.

యేసూ—నిన్నెవ రడిగినారు? మొదటదిన మహారాజు వేట కేగునా? వేటనెపమున నాకి నెటు తీసుకొని పోతూన్నావు?

కబ్జీ—ఇది మహారాజుగారి ఆజ్ఞయే కాని నా ప్రోత్సాహము కానే కాదు.

యేసూ—ఇది నబద్ధము. మహారాజుల్లు నియమించి యుండరు. వారి నప్పుడు మైమరచి యున్నారు, నీ ఆటలు సాగుతూన్నవి. నీ వేదో ద్రోహబుద్ధితో వీరిని బైటికి కొంపోతూన్నావు...మీ పెద్దలారా, మహారాజుగారితో నీ వను దిన మారగించే మృష్టాన్న మాన! నీవు నిజము చెప్పు. అందువల్ల నీకే అపాయము గాని శిక్ష గాని రానివ్వను. ఇదిగో నాపుత్రుని తోడు. నీవు జంకక నిజము చెప్పు. ఇదే వేడుకొంటున్నాను.

కబ్జీ—సర్కార్, మీ రిట్టి దీనాలాపము లాడనేల? నిజముగా మహారాజావారిని వేటకు...

సంభా—కబ్జీ! జాగ్రత్త! మహారాణిగారి యెదుట మాయదారితనము వద్దు. నాకెంత ఆపుడవైనా అమాయిక యైన రాణిని మాయ చేయబోకు. అసత్యము నేను సహింపజాలను. శూరునకు అసత్యమూ శత్రువున్నూ సమానకోపభాజనములే... దేవీ, నేను వేటకు ప్రయాణము కాలేదు.

యేసూ—ఆహా! ఇది అశరీరవాణియా? అమృతపు పోనయా? ఔరా! తుదకు మహారాజుగారే మాయందు

రయజూపినాగు...నీచా! మీపూర్వుల గౌరవము బుగ్గిచేసి నావు. దైన్యము వహించి నిన్నెంత వేడినా నీ మనసు ద్రవించ దాయె ప్రాణము పోయేటప్పుడైనా పెట్టుకొనని నాచిన్నికుమా రునిపై ఒట్టు పెట్టుకొన్నా నీవు నిజము చెప్పవైతివి. సత్య మును నీ వెంత లోతుగా పాతిపెట్టినా, లేక మదిరాసముద్ర మున ముంచినా అది బైటికి వచ్చి తీరును...ఇప్పుడైనా నిజము చెప్పి మహారాజుగారి నెటు ప్రమాణించినావో.

కబ్జీ—అమ్మగారూ, కబ్జీ సత్యసంధుడు కాకుంటే మీ కార్యాలలో ప్రధానపదవి చేసియుండడు—నే నిప్పుడు పల్కిన ది సత్యమే. స్వామిహితముకొరకు కట్లు చేయవలసి వచ్చినది కాని మిమ్ము మోసగించవలెనని కాదు—రాజకార్యనిర్వహణ ములో ఒకానొకప్పు డెట్టివారికైనా అసత్య మాడకతప్పదు. అది మీ కనుభవసిద్ధమే.

యేసూ—మాతో అసత్యమాడి ఇప్పుడు నీవు నిర్వ హించదలచిన రాజకార్య మెట్టిది?

కబ్జీ—అది నేను వివరించతగినది కాదు. తమ బంధు వుల నమ్మి తరించవలెనని మహారాజుగారు తలచియుండి వారి ప్రతిన వారే భంగము చేయడానికి జంకకుంటే మీప్రశ్నకు తగిన జవాబు వారే ఇవ్వగలరు.

సంభా—కబ్జీ—ఇక చాలించు. ప్రతిజ్ఞాభంగము కావిం చేవాడు కాడు సంభాజీ—మన మిక పోదాము. దేవి, ఇప్పుడు

మాటలాడడానికి వ్యవధి లేదు. త్వరగలో వచ్చి నీకు సర్వమూ వివరిస్తాను.

యేసూ—త్వరలో వత్తురా? ఈ నాయకుడను దాటిన వెనుక ఈ కాలుని భల్లూకపుపట్టు మీరు విడిపించుకోగలరా? ఈ యముడు మిమ్ము చుట్టికట్టిన పాశము తెగిపోవు నటుకొంటిరా? మహాప్రభూ' ఎందు కట్టి దురాశ? ఇక్కడినుండి దాటినారా మీకు స్వేచ్ఛ, కుశలము కూడా దూరమగును. ఈ మాంత్రికుని దుర్మంత్రముచేత కట్టుబడి నాగరాజువలె వ్యర్థముగా బుసకొట్టుటే కాని వేరేమీ మీకు చేతకాదు. మీ రాష్ట్రమునకూ మీకూ వియోగమయితీరును. తిరిగీ మీ దివ్యసుందరవిగ్రహము మాకళ్ల పడుట అసంభవము. వీని మాయలలో పడిన మీకీ పాటి విచక్షణ కలుగకపోవడము విధివిలసితము—ఈ విపరీతబుద్ధి మీకేల పుట్టినదో ఎరుగలేకున్నాను. ఈ కఠినాత్ముని మీరు నమ్మవద్దు.

సంభా—దేవీ, నీ వపోహముచేత ఏమేమో కలవరిస్తూన్నావు. కబ్జీ నన్నక్కడికో తీసుకొని పోతున్నాడని నీ ఊహ. నాకు మతిపోలేదు—ఇతడు నన్ను వంచించుననే మాట కల్ల. నా అన్నము తిని నాకు ద్రోహము చేసేటంత కపటి కాడు కబ్జీ—గమ్యస్థానము నాకు తెలియదు కాని అది అపాయకరమైన చోటు కాదు.

యేసూ—ఈమూఢనమ్మకమే ఇంతకు తెచ్చింది—ఇతడు దుశ్శీలుడని మీ రెరుగకపోవడము మన రాష్ట్రవినాశమునకు

హేతువు. నే నింత దూరము మొఱపెట్టుకొన్నందుకైనా మీ రీ ప్రయాణము మానవచ్చునే!... ప్రాణకాంతా! ఇక మా మాటలు విడిచి నటించిగాని మాటలైనా నాకు చెప్పక తీరినది కాదు. ఎక్కడికి పోతే మీ జీవయాత్ర ముగిసి, ప్రాణసమానబంధువులు దూరమగుదురో, ఏచోటికి సకాల మృత్యువు నోరు తెరచుకొని యుండునో అట్టి చోటికి ఈకుల నాశకుడు, రాజద్రోహి, పితృద్రోహి, మిత్రద్రోహి బ్రాహ్మణాపసదుడు మిమ్ము తీసుకొనిపోదలచినాడు. గోవువెంట బోవు వత్సము తెరగున మీ రితనివెంట ప్రయాణమైనారు. వెయ్యేల? నుడిమాట వినక—పరిచితుల జాగరూకుడ ప్రభువు గాని నీ పాపాత్ముడు సర్వనాశకుడు పాదుషా కన్నువేయ మన్నాడు—ఇదే నిని గుట్టు రట్టు చేసినాను—నిదర్శనము చూపి స్తాను; రాముగడను విడిచి బైటికి పోవద్దు—నామాట అసత్య మైతే నాకే శిక్ష విధించినా సమ్మతమే.

సం—దేవీ, కబ్జీ విశ్వాసపాత్రుడు కాడని చాలా మంది వాదము—దానిని విచారించడమునకే నేను ప్రయాణ మైనాను—అచిరకాలమున అతని స్వభావము ప్రత్యక్ష మగును. అదే నే నిప్పుడు చేయదలచినది.

యే—మంచిమాట—ముందు నాబుద్ధి చెల్లించి నా వాదము వినండి; పిమ్మట నిదర్శనములు చూడండి—అతని హృదయము అద్దమువలె మీ కగపడును—వేరు ప్రమాణము లక్కరలేదు. వద్దు ప్రభూ! వీనిని నమ్మవద్దు.

సం—కబ్జీయందు విశ్వాసము కానబడలేదు కాని, అతడిప్పుడు చెప్పినట్లే నన్ను కాపుచేయవలెనని లెక్కలేని యత్నములు లోగడ చేసినారు, ఇప్పుడూ చేస్తూన్నారు. ఆత్మబంధువులను నమ్మి అన్ని విధములా చెడ్డాను—ఇక దుష్టవాడో నిశ్చయించి తీసుకొంటాను. ఇతని వెంటా వెళ్లకమానను. మీరు రక్షకురలండి—కబ్జీ, నడువు—

యే—నేను వెళ్ళను, ఇతనివెంట నిమ్ము వెళ్లనివ్వను. రాజులేని రాయగడము పోయె, రేపు సంభవింపనున్న వైధవ్యపంకమున బడి వనములు గడుపుటకన్న మహారాజుగారిని వ్యామోహ పాశమున బంధించి నే నిక్కడే రాతిబొమ్మవలె నిల్చియుందును. సావిత్రివలె నాపతి ప్రాణముల హరించు యముని హృదయము కరగించి నానాధుని పునర్జీవితునిగా జేయ యత్నిస్తాను; లేదా సహగమనము చేస్తాను. అంతే కాని ఈచండాలుని వెంట నా ప్రాణకాంతుని పోనివ్వను, భవానీదేవి యాన!

సం—ఆడదానిమాటల కడలేటంత పిరికివాడను కాను; మీ మేనేచోలు నీకు తెల్పి ప్రతిజ్ఞాభంగపాపమున గొడిగట్టి నన్ను బహూకరించడము కన్న మాధ్యము నహించి నిన్నవమానించి మాందారిని మేము పోవడమే పరమోత్తమము. (ప్రక్కకు తోసి) కబ్జీ! రా! పోదాము—(వెళ్లుదురు)

యే—జగదంబా! నీవే నా నాధుని రక్షింపవలెను. ఖండో, రా, సామోపాయము సాగింది కాదు; దాన భేద

ములు వ్యర్థములు, ఇంక కరవాలమే గతి; నీవు వీరి వెంటనే పోయి కబ్జీ కంఠము తెగవేయుము. అప్పైని దైవమున్నాడు.

ఖండో—మహాప్రసాదము — జే! భవానీ...

(తెరపడును.)






# మూడో అంకము

## మొదటి రంగము

మొగల్ శిబిరము—గణోజీ సూర్యాజీలు.

గ—నీ కింత కోపము రావడానికి హేతు వేమి?

సూ—మీ వేషాలు కట్టిపెట్టండి—మీ మాయ చూచి మోసపోవడానికి నేను పసిబాలుడను కాను. రాజ వంశమున పుట్టకపోయినా చాలామంది రాజులతో అరమర లేక మెలగినాను. కయ్యానికి కాళ్లు దువ్వే అవసరమిప్పు డేమివచ్చింది? శిక్కే! నీబోటివాళ్ల కెందరికో బుద్ధిచెప్పిన వాడను సుమా నేను.

గ—ఈ ప్రసంగము...

సూ—అబ్బా! ఎంతవాడవు! ఆ ప్రమేయమే ఎరుగనట్లు నటిస్తూన్నావే నీవు.

గ—నీ మనస్సును మైకము కప్పలేదు గదా?...

కొంచెము నడుమువాల్చు, కైపు దిగిన తరువాత కలిసి మాటాడవచ్చును. అప్పుడు నీకు తెలివి వస్తుంది.

సూ—ఇం కెక్కడి తెలివి? తెలివితేటలు నన్ను విడిచి చాలకాల మయింది. ఇక్లాస్‌ఖాన్‌తో చేరి వాయీ దేశముఖి నా కిప్పిస్తానని ఆశపెట్టి కుట్ర అనే మత్తుమందు పెట్టిననాడే నా తెలివి నశించింది. ఆమైకము పెరిగి పెరిగి తుదకు సంభాజీమహారాజుచేత కొరడా దెబ్బలు తినిపించింది. ప్రాణాలు పోతవేమో అని భయపడి ప్రాకారాలుదాటి చావు పరుగున బైట పడ్డాను.

గణో—మనకుట్ర బైట పడినదా?

సూ—అది వెల్లడి కాలేదు—కుత్సితుడా, నీవే దానిని వెల్లడి చేసినావు—వందలకొద్ది ఫిరంగులు పేల్చినా చింతాకంత సందీయని కోటలోనికి సద్దులేకుండా పన్ను చేరనిచ్చిన నన్ను వంచించి యిప్పుడు కపటనాటక మాడుతున్నావా?

గ—పిసాళ్—

సూ—నీ గద్దింపులకు జడిసేవాడను కాను. నీవు కన్నెర్రచేసినంతమాత్రాన గడగడ లాడుతూ ననుకొన్నావా? పిసాళొక్కడే పిచ్చివానివలె మనలో చేరినాడు, వీడిని పిలుక మార్చడము సులభమని ఎంచినా వేమో? ఆ భ్రమ పోగొట్టుకో. నా కిచ్చిన గడువులోగా నేను రాయగడము చేరకపోతే మనగుట్టు బట్టబయలై కబ్జీ భూస్థాపన చేయబడును...శిర్కే, నిన్నొక్కమాట అడుగుతాను—మొదటి

నిర్ణయము ప్రకారము నాకు వాయీ దేశముఖ యిచ్చి మొగలులు నన్ను తమకూటములో చేర్చుకొంటారా? లేక కబ్జీద్వారా కార్యము నిర్వహించ నెంచి వాడి ప్రాణములతో కూడా తమ యత్నము ధ్వంసము చేసుకొంటారా? ఎదో నిశ్చయించి చెప్పు.

గ—మొగలులతోడి నీ మైత్రి కంత రాయము కల్పించిన దెవరు? ఏ లున్నంతవరకూ మహారాష్ట్రులను మాలో చేర్చుకొనవలెనని మేము యత్నిస్తూంటే మాకా ర్యము నిర్వహించ నమకట్టిన నీ బోటి దుర్గాధ్యక్షుని మాన నమునకు రొప్పి గలిగిస్తామా?

సూ—కబ్జీవంటి కార్యశాలి మీలో కలిసినతరువాత నాబోటి అనామధేయు డొక లెక్కా?

గ—ఇది నట్టి అపోహము—కబ్జీకన్న మాకు నీవే ఘనుడవు. కబ్జీ ఎంత కూటనీతిపటుడైనా కరణమే కదా! అత డొనర్చగలిగిన మహాత్కార్యము సంభాజీని మా వశము చేయడమే—నీవో వీరుడవు, శూరుడవు, రాయగిడదుర్గము స్వాధీనపర్చుకొన గలిచిన మొగలులు నీతోటి చెలిమి చెడ గొట్టుకొందురా?

సూ—అలాగైతే నన్ను కోటలోకి చేర్చడములో నేను సాయపడ్డానని కబ్జీ సంభాజీతో చెప్పునా? నాపై నత నికి పగ లేదు, ఇద్దరమూ మొగల పక్షమునాగమే—మీ ప్రేరేపణ లేకుండా తానే నామీద నిప్పులు చెరగునా?

గ—మనగుట్టు బైటపెట్టినవాడు కబ్జీయేనా ?

సూ—ఆహా, వాడే.

గ—నిజమే ?

సూ—సందేహ మేమి? మీ రిక కాలయాపన చేయక వాయి నాకు లభించే ఏర్పాటు చేస్తే మీ కార్యము కొనసాగుతుంది; నాకు సున్న చుట్టితే మీకు హాళ్లి ! కుట్ర కబ్జీ రెండూ శూన్యమే. మీరు నాకు కీడెంచుతే నేను మీకు మే లెంచుతానా ? ఒకరి కట్టూ ఇంకొకరికి ముక్కా నా ?

గ—కబ్జీని నేను ప్రేరేపించినానని నీ కనుమాన మెందుకు కల్గింది ?

సూ—ఏరుదాటిన తరువాత తెప్ప తగులవేసే వాళ్ళు లేరా ? నన్ను మట్టిబెట్టితే కబ్జీ కార్యము సులభతరముగా నెరవేరుతుంది కాబోలు. అప్పుడు పాదుషాకి లాభముంది, నీకూ లాభముంది—సంభాజీమీద పగసాధించవచ్చును. పాదుషా కోపము తీరుతుంది, దక్షిణాపథ మతనికి దక్కుతుంది, నీకు జాగీరు దొరుకుతుంది,—కబ్జీ గొప్ప సవాబౌతాడు—కాబట్టి కబ్జీని మొగలులూ నీవున్నూ ప్రేరేపించి యుండవచ్చును.

గ—సూర్యాజీ, అక్కరకుమాలిన అనుమానము కల్పించుకొని మనస్సెందుకు కలతపెట్టుకొంటావు ? సంభాజీపై పగసాధించుకోవలెనని నేను మొగలుల సాయము కోరినమాట

నిజమే, కాని యుక్తాయుక్త వివేచన లేకుండా వ్యవహరిస్తా ననుకొన్నావా? అయినా యుక్తులు చెపితే నాకేమి లాభము? పగ సాధించడమే నాకు పరమసాధ్యము. భోగలాలసత్వము నిర్మూలమైనదాకా నాకు భోజనము నిద్ర అక్కరలేదు. నాకు వారే శత్రువులు—నీమీద చాడీలు చెప్పుమని నేను కబ్జీని ప్రేరేపించలేదు, భగవత్సాక్షిగా చెప్పుచున్నాను.

సూ—కబ్జీతో మీ కొడంబడిక జరిగిన మాటసత్యమేనా?

గ—అది నిజమే—అందువల్ల సంభాజీని మొగలులకర్పించడానికి మాత్రమే కబ్జీ బాధ్యుడు. రాయగడము జోక్య మతనికి లేదు—

సూర్యా—ఇది నిజమేనా?

గణో—నీకు నామాటయందు గురిలేకుంటే అదిగో ఆడేరాలో ఖాన్‌సాహెబుగారు నిద్రిస్తూయున్నారు, అక్కడికి వస్తే ఆసంబంధమైన వ్రాతకోతలు నీవే స్వయముగా చూసుకోవచ్చును.

సూర్యా—నాయెడ కబ్జీ ఇంత ద్రోహబుద్ధి ఎందుకు పూనినాడు?

గణో—వాడు పీనుగనెత్తి సంతరించిన నేతిముద్ద నాలుకతో నాకేనాడు—వాడి వర్తనము మన మూహించలేము. సంభాజీవిషయము మేము వాడితో పరామర్శించకముందు నీకూ మాకూ రహస్యసంభాషణ జరిగిందని వాడెరుగును.

మొగలులకు తాను తప్ప గత్యంతరం ముంచరాదని నిశ్చ యించి నీ యెడల ఈద్రోహము తలపెట్టియుండును.

సూర్యా—ఔను—ఈయూహ నాకు తట్టలేదు—నీవు చెప్పినట్లు ఇంతా కబ్జీ పని. గట్టిచిక్కే వచ్చింది; ఇందు నాకు కీడు తప్పదు. దేశత్యాగమో దేహత్యాగమో తప్ప నాకు వేరుగతి లేదు.

గణో—మొగలుల ప్రాపున దాపున నీ వున్నన్నాళ్లు నీ కేసంకటమూ కలుగబోదు.

సూర్యా—అవొక్కటే నా విపద్బుద్ధికి శరణోపా యము—నే నిప్పు డన్నమాటలు మదిలో నుంచక నీవు నాయెడ దయచూపకుంటే నాగతి మర్భరము. (మోకరించును)

గణో—నా విషయమై నీకు సందేహము వద్దు. కబ్జీవంటి అధముని గట్టిముప్పులోని బ్రతిమాలవలసి వచ్చెను కదా అని చింతిస్తూన్నాను. వానివలన నాకు గల వైరము నివురుకప్పిన నిప్పులాగు నా హృదయమం దున్నది. వాని భయము నీ కావంతా ఉండనక్కరలేదు—ఇతర రాసాయ ములు సంగ్రహించకుండా సాహెబుగారి చేత జాబు వ్రాయి స్తాను. కబ్జీ కోటలో నున్నాడా?

సూర్యా—లేదు.

గణో—ఎక్కడ దున్నాడు?

సూర్యా—వేటమిషపైని రాజును వెంటబెట్టుకొని నారాయణమైనాడు—సంగమేశ్వరము వెళ్లినాడే మోఅనినాఊహ.

గణో—ఎందుచేత ?

సూర్యా—కబ్జీసు కడతేర్చి మహారాజుగారిని మరలించి కోటలో భద్రము చేయవలెనని రాణిగారు బహు ఆతృతతో త్వరలో సంగమేశ్వరము చేరడానికి అడ్డుతోవల ప్రయాణము చేస్తూన్నారు—వారి కాపుదలకై మావళాలు వెంట నున్నారు, వారికి నాయకుడు ఖండోజి—

గణో—రాణిగారి కా ఆత్ర మెందుకు ?

సూర్యా—కబ్జీవర్తనము శంకించడముచేత. కబ్జీవెంట వేటకు వెళ్లవద్దని, అందు మోసమున్నదని పరిపరివిధముల ఆమె పరిదేవన మొనర్చినా ఆమెమాట లక్ష్యపెట్టక కబ్జీ వెంట మహారాజుగారు వెళ్లినారట—అందుచేత ఏలాగైనా కబ్జీని చంపి వేట మాన్పించవలెనని ఖండోజిని నియమిస్తే అతడు కబ్జీని కలుసుకొన్నాడు కాని రాజుగారియెదుట అతని నేమీ చేయలేక ఇంటికి మరలినాడట—

గణో—విలువలేని వార్త తెల్పినావు—నాపని సగ మీదేరినట్లే. ఒడంబడిక ప్రకారము కబ్జీ రాజు నప్పగిస్తాడు, పిమ్మట వారిద్దరిగతీ ఒకటే అవును... సూర్యాజీ, నీ విక రాయగడమునకు పోయి నిర్భయముగా నిద్రించవచ్చును—సంభాజీ సమసిన తర్వాత మాట్లాడుదాము—ఎవరురా అక్కడ ? ఖాన్ సాహెబుగారిని తీసుకొనిరా. (ఇక్లాస్‌ఖాన్ వచ్చును)

మనకు జయము. ఒడంబడిక ప్రకారము కబ్జీ రాజుగారిని సంగమేశ్వరము చేర్చినాడు—మీరు వెయ్యి సిపాయీ

లతో సంగమేశ్వరము ముట్టడించండి. జాగీగునవదు తనచే తిలో పడ్డదాకా రాజుగారిని మీా కప్పగించడానికి కబ్జీ సందే హించకుండా తగిన ఏర్పాటు చేగేరావుటపామీాక వంపు తాను. రాజుగారిని రాయగడముకు తీసుకొని పోవడానికి రాణి బయలుదేరిందట. గుఱ్ఱపుసిబ్బందితో ఆమె నెదు ర్కొని కైదుచేసి మీాకన్న ముందు నేను సంగమేశ్వరము చేరుతాను—త్వరగా బయలుదేరండి.

---

## రెండోరంగము

సంగమేశ్వరములో పాతభవంతి

సాహీరు, చంద్రావళి.

సాహీ—కబ్జీ మహారాజుగారిని సంగమేశ్వరము తీసుకొని రావడమునకు కారణము దెల్పుతూ రాయగడముకు కబురంపి మూాడురోజు లయింది, ఎవరూ అక్కడనుంచి వచ్చే జాడ లేదు—ఎందుచేతనో?

చ—రాయగడమునుండి రావడానికి వ్యవధి ఉండ వద్దా?

సా—కష్టకాలమున కాలు వేగము సాగవద్దా?

చం—మీాకున్న తొందర అందరికీ ఉంటుందా? మీారు పంపిన దూత కూలివాడు—నిక్కినీల్గి ప్రయాణము సాగించేవాడు కాని తొందరగా పరుగెత్తేవాడుకాడు.

షా—గడియ గడియకూ నా ధైర్యము గళిత మౌ తూన్నది, మనస్సు తల్లడిల్లు తూన్నది.

చం—ఇన్నిపాట్లు మీరు పడుతూన్నందుకు భగవం తుడు మన రాజుగారికి దీర్ఘాయు వొసంగుగాక!

షా—నేనే రాయగడము పోతే?

చం—మీరు వచ్చేలోగా మహారాజుగారు మొగలు లకు చిక్కితే తప్పించే శక్తెవరు?

షా—భగవంతుడే?

చం—భగవంతుడే ప్రాప్తైతే మీరు రాయగడము వెళ్ళడ మెందుకు? నిష్కల్మషచిత్తులయిన మీ ప్రార్థన విని భగవంతుడే రాయగడమునుండి సాయము రప్పించును. మన దినముల వంకరచేత ఆలాగు జరుగకపోతే...

షా—ఊరకున్నా వేమి?

చం—మన ప్రాణాలు రాజుగారి ప్రాణాల కడ్డువేసి "యశోవా మృతుర్వా" అని పోరుదాము.

షాహీ—అది నిశ్చయమే కాని నీ వెంతసాంత్వన మొనర్చినా తహతహపడుతూన్న నాచిత్తము శాంతి నొంద కుండా ఉన్నది.

(ఖాశాబా వచ్చును)

ఖాబా—కొంప మునిగింది. సర్జాకు భయపడి గోవిం దుని చేరదీస్తే వీడు నావేలితోనే నాకన్ను పొడిచినాడు... స్త్రీచిత్త మతి దురవగాహ్యము—నేను స్వతః కుమాపిన్నైనా

గోవిందుకన్న సుందరుడను కాకపోలేదు...వాడే దీని మన
సుకి నచ్చినాడు! చూసునిల్లు నడికప్పునకు పారినవి...(ప్రకి)
ఏమండోయి గోవింద జీగారూ! మీకు సౌఖ్యమా?

పాహీ—మీ దయవల్ల నే సిక్కడ హాయిగా
నున్నాను.

భాశా—ఏమి చంద్రావళీ, నీ మాట ఏమి? ఈగోవిం
దుని చూస్తే నీకు పాహీంగుని చూసిన ట్లున్నదా?

చంద్రా—వ్యర్థముగా న న్నెందుకు బాధిస్తావు?

భాశా—నేను బాధపెట్టుతున్నానా!—ఓహో! ఇంకా
కొంతసేపుదాకా రాకూడదు కాబోలు?...ఏమిరా దున్న
పోతా! దీనిని మచ్చిక చేసుకొంటున్నావా?

చంద్రా—దేవుని వంటివాడు, అతనిని తిట్టకు—నీ
కెందు కంత కోపము అతనిమీద?

భాశా—నీ కెందు కంత దాక్షిణ్యము? రాతిబొమ్మ
నీకు దేవు డయినాడా? ఏమిరా, ఇది నీకు దేవతలాగు
న్నదా?

పాహీ—బాగా అడిగినావు! ఈమె ఉత్తమురాలు!

భాశా—ఐతే పెళ్లి చేసుకొంటావా?

పాహీ—ఆమె కిష్టమై నీవు పెళ్లి చేయిస్తే నా కభ్యం
తరము లేదు.

భాశా—నీవు దీనిని మచ్చిక చేసుకొన్నావా?

పాహీ—ఇంతవరకు అది జరుగలేదు...దీని కింకా

పెళ్లి కాలేదా!...పెళ్లైన పశుచుపట్ల పురుషులు శ్రీరాము నిలా గుండడము మా కులాచారము.

ఖాశా—అందరూ శ్రీరాములైతే అతని గొప్పపది!

షాహీ—ఇంకోడి పెళ్లాముమీద కన్ను వేసినవాడిని కత్తితో నరకడము మా కులధర్మము...నీ వృత్తిమీద నీ విక్కడున్నావు. నీ పెళ్లాముమీద ఎవడైనా కన్ను వేస్తే నీ వేమి చేస్తావు? ఒప్పుకొంటావా?

ఖాశా—ఆ మాట ఎత్తకు. దీనికి పెళ్లి కాలేదు. అందుకనే మచ్చిక చేసుకొంటున్నాను—

(సర్జాబా వచ్చును)

సర్జా—కొంప మునిగింది!

ఖాశా—ఏమి? ఏమి?

సర్జా—కబ్జీ మనమాటలన్నీ విన్నట్టుంది.

ఖాశా—నీ కెలాగు తెలిసింది?

సర్జా—అది తర్వాత చెప్పుతాను—ఇక్లాస్ ఖాను రాజుగారిని పట్టుకోవడానికిన్నీ శిర్కే రాణిగారిని కైదు చెయ్యడానికిన్నీ తలా ఒకదిక్కునుంచి వస్తూన్నారు. కబ్జీ పని సానుకూల మయింది—"నీకూ కాదు నాకూ కాదు, నోటికి పోయిరా తలంబ్రాలు" అన్నట్టు కబ్జీ చంద్రావళిని కట్టుకొంటాడు, మన ప్రాణా లుండవు—ఏమి గతి?

షాహీ—నా కొకటి తోచింది—మనమే ముందుగా మహారాజుగారిదగ్గరకు వెళ్లి ఈ కుట్రమాట చెప్పుదాము...

కబ్జీని రాజుగారే కడతేరుస్తారు, మీరు సుఖముగా నాలుగ కాలా లుండవచ్చును—

ఖాశా— చీచీ పో—మాకు బుద్ధి చెప్పవచ్చినావా?

సర్జా—మనకు రాజుగారి కర్మన మయ్యే దేలాగు? చలిచీను కూడా దూరడానికి సందులేకుండా కబ్జీ కత్తుల పారాలు కాపు పెట్టినాడు.

చంద్రా—అందు కుపాయము నేను చెప్పనా?

ఖాశా, సర్జా—చెప్పు చెప్పు.

చంద్రా—ప్రాణాలు నిలువ వని మీలాగే నేనూ భయపడుతూన్నాను. అంతరమూ రాయగడముకు పారి పోదామా?

ఖాశా—ఇది నాకు నచ్చింది.

సర్జా—(ఖాశాతో) మనకు దీనివల్ల ప్రాణాలూ చంద్రావలీ కూడా దక్కవచ్చును. ఇది నాకూ నచ్చింది.

ఖాశా—సెబాస్! ఒకవైపునుండి ప్రాణాలు పోతూన్నా చంద్రావళిమీద మనసు నిల్పడము మానినావు కావు; వలపంటే నీదే వలపు. బలే!

చంద్రా—ఈ ముట్టుపట్ల దాగుకోవడానికి తగిన తావు చూడుమని ఈ వేటకానిని పంపుదాము.

సర్జా—సరే—ఇది మంచి ఆలోచన.

ఖాశా—సర్జా—మొగలాయీలు నీకు ఎంతలో నాయందో కనుక్కొందాము రా—(పోవుదురు)

చంద్రా—నాథా! ఇం కాలస్య మెందుకు!—మీరు రాయగడమువైపు పయనము కావలెను—అమ్మగారు దగ్గరకే వచ్చియుందురు—

షాహీ—ఇదే బయలుదేరుతూన్నాను—(పోవును)

---

## —మూడోరంగము—

సహ్యాద్రిగిరి అడవి—సంతూమాయి—దాలతీ.

సంతు—ఇదెక్కడి దారి దాలతీ! ఏపక్క చూసినా గుండెలు పగులుతూన్నవి. సూర్యుడస్తమిస్తూన్నాడు. రాయగడము విడిచి మూడు రోజులయింది, ఎద్దు నడవలేకున్నవి; కొంచెము విశ్రమింతా మంటే అంతా అగమ్యగోచరము; తోవ కానృ్పించదు, ఏమి తెలుచుకొన్నా తలప్రాణము తోకకు వస్తూన్నది.

దాల—ఏమి చేయు మందువు? మహారాజావారిని కలశా మాయము చేసినాడని తెలియగానే మొగలులు దారులన్నీ కట్టివేసినారు—అడ్డుతోవ తొక్కవలసి వచ్చింది; భయపడకు, కాస్త ఓపికపట్టితే రేపు మన రాజ్యము చేరుకొందాము.

సంతు—ఈ రాత్రి గడిచి రేపన్నరోజు వస్తుందా అనిపిస్తూంది.

దౌల—నీ కెందుకమ్మా ఇంత జడ, మన కేమి ఆపద రాగలదు?

సంతు—నా మనస్సు నెంత సమాధానపరచుకున్నా ఈ రాత్రి మన కేదో కీడు మూడుతుందని నాకు తోస్తూన్నది. రెండుపక్కలా ఉన్నతపర్వతకందరములూ కాలపురుషుని బోలిన ఉత్తుంగసానువులూ, కీచురాళ్లతో నిండి నిబిడనీరంధ్ర వృక్షరాజిన్నీ "బాలా, ఇక నీ కేటి పుట్టిల్లు, ఏటి అత్తిల్లు" అని అరుస్తూన్నట్లున్నవి.

దౌల—ఇట్టి పిచ్చి ఊహాలు నీ మనస్సులోనికి రానీయకు. నాయం దెంతో నమ్మక ముంచేనే కాని మీ అన్న నన్ను నీకు తోడిచ్చునా? నా కంఠములో ఊపి రున్నంత వరకూ నీకు ప్రమాదము రానిత్తునా? దాచిపెట్టు మన్న ధనము లాగు ప్రాణములకన్న ప్రియతరముగా కాపాడుతాను. ఎల్లప్పుడూ నగరులలో కాలము గడిపే నీ వంటి పడుచు కీ ప్రయాణము భయావహము కావడ మొక వింత కాదు... అదిగో దిగుడు బావి—మోట ఏలాగు నడుస్తూన్నదో చూడు—అక్కడికి పోయి కాళ్లూ చేతులూ కడుగుకొని కొంచెము నీరు తాగి కాస్త చల్లబడుదాము.

సంతు—మంచిది, నడువు.

దౌల—ఓహో! కాపన్నో!

కాపు—వచ్చే! వచ్చే! (కాపు వచ్చును.)

దాల—అంతా బాగుండారా?

కాపు—ఏమిగా గిన్నా? రోజంతా రొమ్ము పగిలేటట్టు పాటుపడినా పట్టెడన్నము పూరాగా చిక్కలేదు—ఇప్పుడు కానిదినాలు వచ్చినాయి, పిల్లా జల్లా ఇంటినిండా ఉన్నారు. ఏదో సాగలేక సాగుతూన్నాము...మీా రెక్కడినుంచొస్తుండారు? ఎక్కడికి పోతూండారు? అయ్యో బాబో, ఆడోళ్ళు కూడుండారా?

దాల—ఇది మా అమ్మాయి—అత్తింటికి తీసుకో పోతున్నా.

కాపు—ఎంత ఘటికుడవయ్యా నీవు! ఎంతపని చేస్తూండావు! పాడు కాలాల్లో పడుచుపిల్లతో పయనమవుతావా?

దాల—ఇక్కడేం భయమా?

కాపు—నీకు మతుందా? లేదా?

దాల—ఈశ్వరుడె కొత్తది, నాకేం తెలియదు.

కాపు—తురకసర్దారు లెదురైతే ఒక్కడవేం చేస్తావు? పిల్లని చేతులార చంపుకొంటావా? లేకుంటే వాళ్ళ నెదాన పెడతావా?

దాల—తురకలీ అడవిలో తిరుగుతూన్నారా?

కాపు—మహారాజెక్కడో మాయమైనాడట—ఎవరికీ తెల్దు—ఆయన్ని పట్టుకోవాలని తురకలు తండతండలు

తిరుగుతూండాగు. ఇప్పుడే యీదారిని కొందరు పోయాగు, మీాకంట పడ్డారనుకొన్నా.

దాం—మేము భయపడినట్లే జరిగినదే!

సంతు—అమ్మయ్యో! నే ననుకొన్న కీడు మూడ నున్నది కాబోలు!

కాఫు—ఈమాత్రంకే అడలిపోతూండారా? ఈచోటి కిప్పుడు మేమే రాజులము. మీాకు కావలసిన సాయము నేను చేస్తాను. మన మంతా ఒక్కతల్లి బిడ్డలము. ఒకరి కొకరు దన్నుగా నుండాల.

సంతు—నీకడుపు చల్లగా మంచిమాటాడినావు.

కాఫు—మా గూడెంలోకి దబ్బున పదండి. ఈరాత్రి అక్కడ గడుపుదాము, రేపటిమాట ఆమెనక సూతాము.

సంతు—మా ప్రాణాలకి దేవుడిలాగు కనబడ్డావు.... (ముందుచూచి) అమ్మయ్యో! ఎవడో గుఱ్ఱముమీాద వస్తూ న్నాడు. చచ్చినాము దాంతీ!...ఎవడో భిల్లుడువలెఉన్నాడు. కాదు కాదు—తులసీరామ్ సాహీాగు...తులసీరామ్!

సాహీ—ఎవరు నన్ను పేరుపెట్టి పిలిచినాగు?

సంతూ—నేను సంతూని—నమస్కారము!

సాహీ—ఖండోజీ చెల్లెలవా, అమ్మా! ఇక్కడి కెందుకు వచ్చినావు?

సంతూ—అత్తవారింటికి పోతూన్నాను.

సాహీ—తో డెవరు?

దాల—నేను దాలతిని.

షాహీ—తగిన సమయానికి తటస్థించినావు. దాలతీ, ఆసన్ననిర్వాణమైన జ్యోతి అధికముగా ప్రజ్వరిల్లుతుంది. చచ్చేముందు మానవులకు తెలివి వస్తుంది.

దాల—మహారాజుగారికి కుశలమా ?

షాహీ—రాజుగారు! కుశలము! నేను బయలుదేరే సరికి కుశలమే.

దాల—తరువాత ఆపద వాటిల్లిందా ?

షాహీ—అది నాకు తెలియదు.

దాల—వారు విపద్దశలో నుంటే మీ రిటుల వచ్చినారు ?

షాహీ—ఒంటివాడను, నాచేత నే మవుతుంది ? శత్రువులచేత చిక్కకుండా మహారాజుగారిని కాచుకొని యుందునా? మహారాణీగారిని కైదు చేయవలెనని గణోజీశిర్కే వస్తూన్నాడని ఖండోజీకి రహస్యవార్త తెలియజేతునా ?

దాల—ఈమాటలు వింటే నాకు మతిపోతూన్నది. అమ్మగారు రాయగడను వదలి ఇటుల వస్తూన్నారు ?

షాహీ—మహారాజుగారిని రాయగడముకు తీసుకొని పోవలెనని సంగమేశ్వరముకు బయలుదేరినారు—కాలయాపన చేస్తే కార్యము మించుతుంది—ముందు ఖండోజీని కలుసుకోవలెను—నేను పోతాను.

దాల—వెర్రివాడా! మహారాజుగారు శత్రువులకు చిక్కకుండే సాధనము చూడవద్దా? త్వరగా సంగమేశ్వరము చేరుకో.

షాహీ—అమ్మగారి మాట? ఆమె కవమానము తప్పించవద్దా? ఖండోజీ కీ రెండువార్తలు చెప్పేవా రెవరు?

దాల—ఆపని నే జేయగలను.

షాహీ—సంతూ నేమి చేస్తావు?

దాల—ఈ రెండు పనులూ నేను చక్కబెట్టగలను. నీవు మహారాజుగారిని కనిపెట్టి వుండు. (షాహీను పోవును) కాపునాయకుఁడా! స్వజాతీయుడవు. పేదవాడవైనా ఉదారుడవు. ఈపడుచు ఖండోజి చెల్లెలు—నీ కప్పగిస్తూన్నాను, జాగ్రత్తగా కాపాడు.

(ఖండోజి వచ్చును)

ఖండో—దాలతీ! నేను కాపాడగలను.

సంతూ—అన్నయ్యా! కంటపడ్డావా? కలకాలము బ్రతుకు!

ఖండో—ఈమె నిక్కడ దిగవిడిచి నీ వేమి చేయనెంచినావు?

దాల—ప్రభూ! ఘోరసంకటములు ప్రాప్తించినవి. గణోజీ అమ్మగారిని కైదు చేయవలెనని ఆరువందల అరబ్బీలతో వస్తూన్నాడు. మహారాజును పట్టుకొందామని ఇక్లాస్ ఖాను సంగమేశ్వరము పోతూన్నాడు.

ఖండో—ఇది నీ కేలాగు తెలిసింది ?

దాల—షాహీ గిప్పుడే చెప్పి పోయినాడు.

ఖండో—ఇంతతో మన దుర్దశ దురతిక్రమణీయ మయింది. హా ! దైవమా! మా నుదుట ఏమి వ్రాసినావో? మహారాజుగారికి ఘటింపనున్న ఆపద తప్పించడానికి చరమోపాయ మని ఎండకన్నెరుగని మహాసాధ్వి మహారాణిగారిని ఘోరారణ్యములకు తెచ్చి, రాజుగారిని వెంటబెట్టుకొని రాకుండా రాయగడములో కాలుపెట్టనని రాజారామ్‌గారితో ప్రమాణము చేసినాను. "ఇంటి గుట్టు లంకకు చేట"న్నట్లు కృతఘ్నుడు రాజద్రోహి అయిన గణోజివల్ల నా యత్నము లన్నీ ధ్వస్తము లైనవి. నలుగురు మానవశాలలతో నావల్ల నేమాతుంది ? సకల సార్వభౌముడైన మహా రాజును కాచుకొని యుండనా, లేక మాంజాతికి నోములపంట ఐన మహారాణిని కాచుకొని యుండనా ?

సంతు—అన్నయ్యా, పాతరాజుగారు పట్టెడు మావళీలతో మనరాష్ట్రము ప్రతిష్ఠించలేదా ?

ఖండో—ఆయన అవతారమూర్తి; అతనికి సాటివీరు డీఅవనిలో లేడు. ఆయన కార్యము లతిమానుషములు, అవన్నీ వారి మహత్త్వముచేత సాధింపబడినవే కాని ఉపకరణముల చేత కాదు. ఆయన చర్య అదృష్టశ్రుతపూర్వము.

సంతు—మర్రి చెట్టు మొదలు తెగనున్నప్పుడు ఊడలు దాని నిల్పవలెను ఏనాడో రాక్షసకులనాశనము

కావించి ప్రజలను బిడ్డలవలె ఏలిపాలించిన శ్రీరాముని కీర్తి ఆచంద్రార్కము నిల్చినట్లు నిర్జీవములైన గుళ్ళూ గుండములూ, కొండలూ, చెట్లూ, చేమలు కాపాడుతూన్న వే. మొన్ననే కలికాలములో రామరాజ్యము స్థాపించిన మహారాజుగారి కొడుకుని కోల్పోయి కాచి వారి యశము నిలువబెట్టడము శూరులు వీరులను విఱ్ఱవీగే మాంబోటి సజాతీయులకే సాధ్యము కాకున్నది! ఏమని చెప్పుదును?

ఖండో——అపోహాము చేత వ్యర్థముగా నన్ను తృణీకరిస్తూన్నావు. బాల్యమునుండి నన్ను లాలనపాలనచేసి ఏ సాధ్వి తన దేహమునకు శ్రమ కల్గించుకొన్నదో ఆమె చరణకమలములకు నా సర్వస్వ మర్పించుటకు నేను లేశమైనా జంకను. కాని ఏమి చేసినా సార్వభౌమసంపతులను విపత్సాగరమునుండి తప్పింపజాలను... దౌర్భాగ్యమా! పాషాణనిష్ఠురపరికరములతో పనులుపలుగున రా! జన్మజన్మాంతములయందు మే మొనర్చిన పాతకములారా! ఒక్కపెట్టున మామీద పడండి. మిమ్ము ప్రతిఘటించి నిల్చెదము... అమ్మాయీ! ఇటు రా! పురందరకోటముట్టడిలో ఒక పఠాణు రౌతు హఠాత్తుగా మురారిబాజీ కంఠమును ఖండించెనట. ఆ మొండెము ముప్పది అడుగులు వేసి ముష్కరమూక శూరులను దునుమాడి ధరపైని కూలెనట... విశాలగడమునకు పోవు తోవలో అర్థరాత్రి వేళ మతాబుల వెలుగున ఎనిమిదివేల మొగలులు ఆబాసాహెబుగారిని వెంబడించినప్పుడు ప్రభురక్షణార్థము

వంశాల మాలవళీలతో శాజీ ప్రభువు కొండలోయ
ను నిల్చి తన శరీరము జల్లెడవలె తూట్లుపడి రక్త
లు ప్రవహిస్తూన్నా మహారాజుగారు కుశలముగా
ప్రాసాదము చేరినారన్న వార్త చెవిని పడేవరకూ పోరి
ట వీరస్వర్గము చేరినాడు. అట్టి శాయుసకులమున మనము
ంచినాము. వారిఖ్యాతి మనము నిలువపెట్టవలెను.

సంతు—ఇప్పుడు మనము చేయవలసిన పనియేమి ?

ఖండో—మహారాణిగారి మానప్రాణములకు హాని
పన్నదని ఎరుగుదువా ?

సంతు—విన్నాను.

ఖండో—అమ్మగారి రక్షణార్థము పారిస్తానే మేనాలో
గ్గండి వారికి రాబున్న ఆపద నీవు తొలగించవలెను.

సంతు—ముడిమాట చెప్పక ఇన్ని మాట లెందుకు ?
దానవని ఇంత అనుమానించినావా ? నాకు ప్రాణములు
నుకొన్నావా ? లక్షలకొలది ప్రజల పోషించే మహారాణి
మానప్రాణములకు హాని వచ్చేటప్పుడు దానిని తొల
నే ఉత్తమ కర్తవ్యమును ఊరక పోనిత్తునా ? నీవు సర్వ
ము బలివేయనెంచి కార్యాంబుధిని మునుకడానికి సిద్ధుడ
ప్పుడు నీచెల్లెలిని నేను మాత్రము వెనక తీస్తానా? నీ వేలి
కుటుంగర మిస్తివా కరకర నమిలి కార్యము సాధిస్తాను.

ఖండో—ఇదిగో ఉంగరము (చూపును) రాజహంసను
పడానికి భగవంతుడు ముత్తెపుపొడి మేపించునట.

అలాగు నిన్నంతా మోసంచడానికి నేను వజ్రపుపొడి ఇస్తున్నాను. ఈవజ్రము కొద్దిగా నమిలి మింగితేవా వచ్చని నీబిళ్లు బూడిదె వలె నల్లపడుతుంది; పిమ్మట యమయాతన అనుభవిస్తావు. కాని శీఘ్రముగా నీ ఆత్మకు నిరతిశయానందము నిచ్చే సాయుజ్యము లభిస్తుంది (ఇచ్చును.)

(యేసూబాయి పెద్దబోయీలా వత్తురు)

యేసూ—ఆపిల్లకు ఉంగర మెందుకిచ్చినావు? ఆమెతో నేమి చెప్పతూన్నావు?

సంతు—దీనిని నేను పెట్టుకోవలెనని ముచ్చట పడ్డాను—అందు కిచ్చినాడు.

యేసూ—మీా రేదో ఘోరకార్యము తలపెట్టినట్లుంది.

ఖండో— స్వామి భక్తులకు సహజమైన పని చేస్తూన్నాము కాని ద్రోహ మేమీా తలపలేదు.

యేసూ—మీారు కేవల మానవులు కారు, శాపభ్రష్టులై జనించిన దేవతలో ఋషులో! మీా చిత్తవృత్తి నెరుగ నాకు వశమా?

ఖండో—మీాతో ఎప్పుడైనా అసత్య మాడినానా?

యేసూ—ఈపిల్ల ఉంగరమున్ని పోరుపెట్టినదా? దీని కుంగరమే కావలిస్తే మన భాండారములు లేవా?...ఖండోజీ, నీ వేమన్నా సరే. ఈపిల్ల ప్రాణముపట్ల నీమనస్సులో నేదో కీడు జనించిన దని నాకు తోచినది. నాకురానున్న కీడు...

(వేగు వచ్చును)

వేగు—భద్రము, భద్రము, ఖండోజీ—అమ్మగారిని జాగ్రత్తగాచూడు. శత్రువులు సమీపిస్తూన్నారు—అందరిలో ముందు గణోజీ చావుపరుగున వస్తూన్నాడు.

(పోవును)

ఖండో—పిడుగువంటి వార్త తెల్పినాడే!

యేసూ—శత్రువు చేరవచ్చెనా? నన్నవమానించవలె నని నాఅన్న గణోజి వస్తూన్నాడా?...ఇప్పటి కంతా తెలిసింది. ఈవార్తకు వెరచియే కాబోలు సంతూమామాయికి వజ్రపుటుంగర మిచ్చినావు!...మాటాడవేమి?

ఖండో—నిజము. నన్ను మన్నించండి.

యేసూ—ముక్కుపచ్చలారని ముగ్ధను చంపి నా ప్రాణము దక్కించుకొంటూనా? సాధ్వియైన ఈ సుమంగళిని చంపుతే నాసౌభాగ్యము సాంద్రముగా సాగునా?

ఖండో—ఈపట్టున మీరు మామాట వినక తప్పదు—మనమాట వినకపోవడము చేతనే మహారాజుగారు దురవనేయమైన దుస్థితిలో నున్నారు—మీరు ఈక్షణమే అద్భుతోవల రాయగడమునకు ప్రయాణము కావలయు. మహారాజుగారి విషయమున మీకు బెంగవద్దు, త్వరలోనే వారిని రాయగడము చేర్చగలము. కష్టమని వెనుదీయక కుశలప్రదమైన రీతి అవలంబించండి, పరుగుడంచీలపై వస్తుండియైనా రాజప్రాసాదము ప్రవేశించండి. (రాణీ దాలతీ పోవుదురు)

(సంతూతో) చెల్లీ, ఇవే మన తుదిచూపులు, అమ్మగారి సవారీలో కూర్చో.

(తెరలో దీన్ దీన్ అని కేకలు.)

అదిగో శత్రువులు సమీపిస్తూన్నారు.

సంతూ—నీవిధి నిర్వర్తించు. ఇదే నమస్కారము.

ఖండో—మన కులదేవతలకు, నీ పతికి, మనపెద్దలకీ మొక్కి కాలానుగుణ్యముగా వ్యవహరించు. (తెరలో దీన్ దీన్)

ఇంక కావలసినంత అరవండి. ఇదే నేను సంగమేశ్వరము పోతూన్నాను. బోయీనాయకా! అమ్మాయి వజ్రము మింగగానే (చెవిలో చెప్పును)

నాయ—సాగనీయండి సవారి! (గణోజి వచ్చును)

గణో—ఆపు సవారి.

నాయ—అడ్డు లే. నీవెనడ వాపుమనడానికి?

గణో—ఎవరితో మాటలాడుతూన్నావో ఎరుగుదువా?

నాయ—తెలియకేమి? తురకసైన్యము వెంటబెట్టుకొని తన సోదరికి ఘాతకుడైనట్టి కంకణము గట్టిన కలుషాత్ముడు గణోజీతో. నడవండి—ఈ నీచునికి జడియవద్దు.

గణో—ఓరీ, వదరబోకు, నీ ప్రాణము లుండజూసుకో.

నాయ—ఓరి కసాయివాడా? మహారాణిగారి ప్రాణములకన్న మాప్రాణా లెక్కువా? నీవంటి తుచ్ఛుడను కాను స్వకీయుల మానప్రాణములు తీయడానికి.

గణో—మీ మహారాణిని కైదు చేయక మానను. తీయండి కత్తులు. (యుద్ధముజరుగును—తెరలో శిర్కే! శిర్కే! ఖండోజీ కొంతసైన్యముతో సంగమేశ్వరము చేరుతూన్నాడు. మించిపోయె! మించిపోయె) ఏమిది? ఖండోగాడు రాజుగారిని రక్షించడానికి పోతూన్నట్లుంది. రిసల్దారూ! నీవు వెంటనే పో! సంభాజీమీద ముందు పడుదాము. సవారీకూడా సాగనీ (పోవుదురు).

నాయ—పో—కుత్సితుడా! పొంగి పోతున్నావు కాని, నీవంటి తుచ్ఛునిచేత చిక్కేటంత పాపము చేయలేదు మహారాణీగారు. ఇలాగే మహారాజుగారు కూడా నీకంట్లో దుమ్ము జల్లితే నీ పాపము పండుతుంది. సంతూమామాయి జన్మ సఫలమయినది. (తెరపడును).

---

## నాల్గో రంగము

### సంగమేశ్వరములో ప్రాసాదము

(కబ్జీ ప్రవేశించును).

కబ్జీ—అబ్బా! ఏమి ఘోరమైన రాత్రి! గాఢాంధకారము విశ్వమును గ్రసించినది. జీవితకాలమంతా పాపాచరణమే తప్ప పుణ్యమేమో ఎరుగక శల్యమాత్రావశిష్టుడై క్రియానష్టుడైనదీర్ఘరోగివికటాట్టహాసముకన్న భయానకముగానుంది. క్రిమికీటాదుల కర్కశరవము, త్రోవలమధ్య భూత

ప్రేతముల కొసగబడిన బలిరాసు లారగింప వీకులాడే బక్క
కుక్కల వికృతభోంకారములు, కుళ్లినశవముల యెముకలకై
పోట్లాడే సివంగుల కూతలు, తోడేళ్ల అరుపులూ—ఈ ధ్వనులు
తప్ప ఇతర మేదీ చెవిని బడలేదు. నడిమింట భానుని పూర్ణ
ముగా గ్రసించిన కేతుమూటకేమి ద్వాదశాదిత్యులనే కాక
విశ్వమునంతా పొట్టను పెట్టుకొన్న ప్రళయరాత్రి కూడా
ఇట్టి అశౌచపు కళ ప్రసరింపజాలదు—ఈ నిబిడనిశీథమున
ఎటుచూచినా అనుభవశిష్టములై మహాపాతకుల ఘోర
వాసనాబృందము దాల్చిన భూతప్రేతపిశాచఢాకినీ రూపములు
తప్ప వేరు దృశ్యము కాన్పించదాయెను!...ఏదో ధ్వని విన
బడ్డట్టు లుంది...సంభాజి కలవరింపు కాబోలు. చేసుకొన్న
పాపసంచయము దుస్స్వప్నరూపమున అతని నిద్రను కలత
పెట్టుతూన్నది! గాఢనిద్రాసుఖ మితని కీజన్మాన లేదు......
ఇంకెంతకాలము జీవించగలడు? కృతాంతుని బోలిన ఇక్లాస్
ఖాన్ రానున్నాడు—అతనిపాలబడిన వెనక ఇతని జీవయాత్ర
సమాప్త మగును. ఖండోజి ప్రాణములపై నాస విడిచి వచ్చి
నాడే కాని ఇతని నుదుటివ్రాత తప్పింప నతనికి తరమా?
నక్షత్రము లెంత కాంతివంతములైనా గాఢాంధకారమును
తొలగించగలవా? ఉల్కాపాతమువలె ఉట్టిపడ్డ ఖండోగాడు
కూడా ఈ దెబ్బతో కన్ను మూసితీరుతాడు. ఒకవేళ
ఈ గండము తప్పిందా ఈశ్వరానుగ్రహ మనుకోవలెను...
ఏదో కాలిచప్పుడు వినబడ్డట్టుంది...మొగలనేన వస్తూన్న

దని తెల్పడానికి దూత ఎవడైనా వచ్చినా డేమో! లేకుంటే......

(తులసి వచ్చును)

తుల—కబ్జీ! కబ్జీ!

కబ్జీ—ఎవ రది?......తులసీ!

తుల—మొగలు సింగా రాలేదా?

కబ్జీ—లేదు—ఆ జాడే కానరాలేదు.

తుల—నా గుండె జారిపోతూంది.

కబ్జీ—ఏ మది?

తుల—ఏమి పీడకలలు? తరుమండి—చంపండి—అని వెర్రి కేకలు వేస్తూన్నాడు మహారాజు.

కబ్జీ—మేలుకొల్పి మరొక పెగ్ పోస్తివా నోరు కట్టిపోతుంది.

తుల—అలాగే చేతా మనుకొన్నాను—తీరా గ్లాసు నింపేసరికి ఏదో కాలిచప్పుడు వినబడ్డది.

కబ్జీ—ఇన్ని పారాలు దాటి ఎవడు రాగలడు?

తుల—నిజమే, నామాట నమ్మవేమి? చప్పుడు వినబడగానే నాల్గువైపులా పరికించి చూచినాను. అప్పుడు సన్నని గొంతుకతో "రాజా! పగవారి పంచ! పదిలము! పగవారి పంచ! బహు జాగ్రత్త!" అని హెచ్చరిక వినిపించింది—అదిగో రాజు లేచినాడు. (పక్కకు జారుదురు).

సంభా—ఎవరా పగవారిపంచ అని అన్నది? నాపై పగబట్టి నన్ను మోసగించ దలచిన కాలసర్ప మేది?... ఎటుచూచినా ఎవరూ కానరారు. పీడకల గని అరతెలివిలో నుండగా "రాజా! పగవారి పంచ! జాగ్రత్త!" అని నన్ను హెచ్చరించిన దెవ్వరు?... ఈ ఇంటికి నేలమాళ్య మున్నదా? అంచలి భూత మేదైనా అరచియుండునా? కరుణార్ద్రమైన ఆ కంఠధ్వని నాచెవిని బడినతోడనే కలుషాత్ముడైన కబ్జీ కుట్రనుంగూర్చి మహారాణి పల్కిన పల్కులు జ్ఞప్తికి వస్తూన్నవి—ఇదంతా మోసమా! కబ్జీ ఏడీ?

(తెరలో రాజా! పగవారి పంచ! బహుజాగ్రత్త!)

తిరిగీ అదే హెచ్చరిక! కబ్జీ!

కబ్జీ—మహాప్రభూ!

సంభా—నీ ఏర్పాటులో ఏదో పరామరిక జరిగిన ట్లున్నది—పహారాజవానులు మత్తెక్కినారా?

కబ్జీ—లేదు—మహారాజా! ఇప్పుడే చూచి వచ్చి నాను—ప్రభువులవద్ద నుంచిన పహారాలో పరామరిక ఉంటుందా? నేను బహు జాగ్రత్తతో పరికిస్తూన్నాను.

సంభా—ఇప్పు డొకధ్వని వినబడ్డది విన్నావా?

కబ్జీ—లేదే—ప్రభువువారు భ్రమపడుతూన్నారు.

సంభా—కాదు కాదు—నేను స్పష్టముగా విన్నాను—నాకు నేడేమో దుస్స్వప్నము లనేకములు వస్తూన్నవి—మా తండ్రిగారు నాకు పదేపదే కనబడి "బిడ్డా! మోసము

నకు గురి కాకుమా! ఈక్షణమే రాయగడముకు ప్రయా
ణము కమ్ము”ని హెచ్చరించినారు. వెంటనే... .....

(తెరలో) “రాజా! పగవారి పంచ! జాగ్రత్త!”
విన్నావా ఆధ్వని—ఇదే పలుసార్లు వినబడ్డది.

కబ్జీ—(స్వ) ఓహో! ఇది చంద్రావళి కంఠధ్వని.

సంభా—పోయి చూడు—ఈ ధ్వని ఎక్కడ పుట్టు
తూన్నది? మాతండ్రిగారి హెచ్చరిక, నా భార్య చెప్పిన
మాటలూ, ఈ కేక—ఈ మూడింటిని సంప్రతించి చూస్తే
నేను శత్రుమధ్యమున ఉన్నానని నిశ్చితమవుతూన్నది. పహరా
జవానులు ప్రమత్తులు కాకుంటే ఈ విపరీత మేలాగు జరి
గింది?

కబ్జీ—మహాప్రభూ! ఇవన్నీ భూతచేష్టలు. చాడ
ముండ మహిషాసురమర్దనీ మహామంత్రము సిద్ధించే వేళ
గనుక—

“అపక్రామంతి భూతాని పిశాచా స్సర్వతో దిశామ్
సర్వేషా మవరోధేన...—”అనే మహామంత్రముతో ఈ
చోటు అరికట్టివేసినాను—అందుచేత నిల్వ నీడలేక భూత
ములు అంతరాళమున సంచరిస్తూ వికటప్రతికూలచేష్టలు
చేస్తూన్నవి—ఇదొక వింత కాదు.

సంభా—భూతముల బొబ్బ లన్నా సరే, మా కుల
దేవతల కుశలవచనము లన్నా సరే, మా తండ్రిగారి హెచ్చ
రికతో సరిగా మేళవిస్తూన్నవి. అందుచేత నాకు వాటియందు

నమ్మకము కుదిరింది—ఇక నిక్కడ కాలయాపనము చేయవలె నని లేదు. ఈక్షణమే రాయగడమునకు బయలుదేరి తీరు తాను—నీవు ఏర్పాటులు చెయ్యక తీరదు.

కబ్జీ—జగదంబ! జగదంబ! ఎంత తెలివిమాలిన యోచన మహాప్రభూ! మీవంటి ధైర్యశాలులు సాహస వంతులు భూతముల బొబ్బలకు భయపడుట భావ్యమా? పసిబాలుడైనా పరిహసించడా?

సంభా—వ్యర్థముగా నిక్కడ కాలక్షేపము చేయ రాదు-ప్రాణభీతిచేత కాకపోయినా సామ్రాజ్యక్షేమము కొర కైనా ప్రమత్తుడనై పరులపంచ నుండరాదు—యుద్ధభూమిని సాటిశూరులతో పోరి సమసినట్లైతే చింతలేదు—ఇక్క డది లేదు—మంత్రతంత్రము లనే నీ మాయకు లోబడి శత్రువుల బారిని పడితే—తాగుబోతురాజు తాగుడు చేతనే చచ్చినా డనీ, తులసి మోహవాగురులలో జిక్కి సంభాజి తాను చావ డమే కాక సామ్రాజ్య మంతా నున్నచుట్టినా డనే అపఖ్యాతి నా నెత్తిపై కెక్కుతుంది—త్వరగా రాయగడప్రయాణమున కేర్పాటులు చేయవలెను.

కబ్జీ—(వెడనవ్వుతో) సుఖముగా కుడిచి కూర్చుండి లేనిపోని ఆపద లాహ్వానిస్తా రేల? చిన్న మేఘము సూర్యుని చాటుచేసినప్పుడు గ్రహణము పట్టునా? మేఘ గర్జనమునకు భూమి కంపించునా? అతిమానుష చర్యలకు మీరిట్లు అడల నేల?

సంభా—అహోరాత్రములు నా అడుగులకు మడుగులొత్తి సేవచేస్తూ అతివినయముతో నాయాజ్ఞలుమన్నించే కబ్జీ నేను నామాట లక్ష్యముచేయక మాటలతో కాలము గడుపడము చూస్తే వీ డేదో ద్రోహము తలపెట్టిన ట్లుంది. ఇదివరకు వీనిమాట లెంతో శ్రోత్రపేయముగా నుండేవి, వాటియందు నాకు దృఢమైనవిశ్వాస ముండేది—ఇప్పుడు అవి యమయాతన కలిగిస్తూన్నవి. రాణి చెప్పినట్లు వీడు ధనాశచేతనన్ను శత్రువుల కమ్మునా ఏమి ? (పైకి) కబ్జీ! నామాట నీకు వినబడలేదా? ఇదివర కెన్నడూ నా కెదురాడని వాడవు ఇప్పుడు నా యాజ్ఞ లక్ష్యము చేయవేమి?...ఇంకోసారి చెప్పుతూన్నాను—నే నిక్కడింకొక క్షణమైనా నిల్వను. పద రాయగడమునకు—రాణీని యువరాజనూ చూడవలెనని నాచిత్తము తత్తరపడుతూన్నది.

కబ్జీ—మహాప్రభూ! మీ యాజ్ఞ నే నిప్పుడు మన్నించలేను.

సంభా—ఎంత తలబిరుసు! పేనుకి పెత్తన మిచ్చినట్లాయెను నీ కధికార మివ్వడము—ఖలచిత్తా! నీవు కపటివని ఇప్పుడు స్పష్ట మయినది.

కబ్జీ—మహాప్రభూ! మీ రనవసరముగా కొందలపడుతూన్నారు. మీయాజ్ఞ లొకదాని కొకటి వ్యతిరేకముగా నున్నవి—మంత్రసిద్ధి అయ్యేవరకూ నా మనవికి ప్రతికూలముగా వ్యవహరించ నని నాకు వచన మిచ్చినారు—సిద్ధి సమీ

పించినది, ఇప్పుడు వచనభంగపాతమునకు ఒడిగట్టి రాయగడ మునకు ప్రయాణము చేయడ మన్యాయము—సిద్ధి పరిసమాప్తి కానున్న సమయమున విఘ్నము రాకూడదు; అందువల్ల మంత్రము బెడిసికొట్టి మీకో మీ రాష్ట్రమునకో చేటు తెచ్చి తీరును. కావున నాకెంత ఇష్టము లేకపోయినా మీయాజ్ఞ నుల్లంఘించక తీరినదికాదు.

సంభా—గర్భదరిద్రుడవైన నిన్ను కలవానిగా చేసి నాను—గోచిపాతరాయనికి గొప్పపదవి కల్పించినాను—ఇంత చేసినది నాకు ప్రాణసంకటము వచ్చినప్పుడు నామాట నిర్లక్ష్యము చేయుడమునకా? నీమాట నమ్మి ప్రాణపదమైన నారాణి నవమానించినాను—ఇంతవరకూ నిన్ను బహూకరించినదానికి ప్రత్యుపకారముగా కుట్ర పన్ని నన్ను మోసగించి నా కపకార మొనరింతువా?

కబ్జీ—నేను కుట్ర పన్నినానని ఎవరు నిరూపించ గలరు?

(చంద్రావళి వచ్చును)

చంద్రా—నేను నిరూపిస్తాను.

సంభా—చంద్రావళీ, నిన్ను రాయగడమున బందిఖానాలో నుంచినానే—ఇక్కడికెలాగు రాగల్గినావు?

చంద్రా—మహాప్రభూ! మన్నించండి—నే నిచ్చటికి కోరి రాలేదు.

సంభా—నిన్నెవరు రప్పించినారు?

చంద్రా—మహాప్రభూ! నిజము చెప్పుతూన్నాను—మహారాష్ట్ర ప్రభువును మరణద్వారముకడ చేర్చిన మహాద్రోహి, నవకోటి రాజనరేంద్రుని నాశము గావింప నానాకపటవ్యూహములు పన్నిన కూటనీతిపటుడు—గోబ్రాహ్మణరక్షణాధురంధరుని గంగిగోవును కసాయివాని కమ్మజూపిన కఠినాత్ముడు—మంత్ర తంత్ర ప్రవీణత అను మిషచేత మాయాజాలము పన్ని మహామహితాత్ముని మచ్చుమూప యత్నించిన మహేంద్రజాలికుడు—నీచాతినీచకులోత్పన్నుడై నికృష్టముష్టింపచజీవనము సల్పెడు రుగ్ణశునకతుల్యుడై కనకాభిషేకముననైనా కరవుతీరక వెనుకటి గుణమహాత్మ్యమున మొగలుల ఉచ్ఛిష్టరాజ్యకబళమున కాసించి అన్నదాత అపరవిధాత ఐన మహారాష్ట్రమండలేశ్వరుని మానప్రాణములు వాగి గర్భశత్రువు, సర్వగ్రాహక దురాశాపరుడైన మహమ్మదీయసార్వభౌమున కప్పగించ నెంచి తరుణ మాసన్నమగువరకు, తాటోటుమాటలు తథ్యేతరములైన ఆత్మస్తుతి పరనిందావహములైన ఆకాశభాషణములతో కాలయాపనము చేస్తూన్న కపటి, తుచ్ఛుడు, భీరుడు, అసత్యవాది అయిన కలశా కబ్జీ, మానమర్యాదలు కాపాడుకొంటూ మూల నుండవలసిన ముగ్ధను నడిబజారున కీడ్చినాడు.

(తెరలో ఫిరంగిధ్వని—దీన్ దీన్—హరహర మహాదేవా అని కేకలు. కిటికీనుండి ఖండోజి దుముకును.)

సంభా—ఎవ రది?

ఖండో—దగా! దగా! మహాప్రభూ! విశ్వాస ఘాత! ఇక్లాస్‌ఖాన్ సైన్యము హఠాత్తుగా ఈ యింటిని ముట్టడించినది. ద్వారముకడ నిలిచి శిర్కే మావళేల తెగ నరుకుతూన్నాడు. తప్పించుకొన దారిలేదు. ఈ చండాలుని పన్నాగమేయిది. మహారాష్ట్రమును మట్టిలో కలప నెంచినాడు.

తెరలో—దీన్ దీన్—హరహరమహాదేవ!

సంభా—హృదయము పాషాణమయ మయింది, ఇంక పగిలిపోనున్నది. మహాత్వాకాంక్ష కుంటితొంటి యైనది. చండాలుడా! స్వజనధ్వంస మొనర్చి శత్రువులను ప్రశంసిస్తూన్నావా? ఇదిగో నీ కర్మఫల మనుభవించు (వీక నరుక బోయి) చీచీ! నిన్ను చంపను. గోబ్రాహ్మణప్రతిపాలన ఛత్రపతులకు కులధర్మము, వ్రతము. ఆసననిర్వాణుడనైన నే నిప్పుడు బ్రహ్మహత్యకు పూనను. పో! నాయెదుట నుండకు. (తన్నును).

ఖండో—మహారాష్ట్రశూరులారా! మావళా ప్రభువు మర్యాద నిల్పినారు? శిర్కేని చితకపొడవండి...అయ్యో! అయ్యో! సింహద్వారము చీలిక లయింది. మహాప్రభూ!

సంభా—వాయువేగమున శత్రువుల ఖండించి పోదామా? జయమేనా కల్గును, లేదా వీరస్వర్గము చేరుదాము. శూరు డెప్పటికైనా సంగరరంగమందు శయనించవలసినదే! కులదేవతలకు మొక్కి "హరహరమహాదేవ" అని గర్జించి అరుల చెండాడుదాము.

చంద్రా—వద్దు—మహాప్రభూ! వద్దు. సాధారణ భటునివలె మహారాష్ట్ర సార్వభౌముని కర్కశ పఠాణి బృందము బారిని పడనీయను. మిమ్ము కూలినప్పుడు మృత్యువు వాత బడవచ్చును. అంతవరకూ నేను వచ్చిన రహస్య మార్గము...

సంభా—శత్రువులు సమీపవర్తులై గర్జిస్తూండగా, సద్వీరవంశసంజాతులైన సంబాంధీకులు మహాగ్రహముతో శత్రువుల చీల్చి పోరుతూండగా, పిరికినై బిలమార్గమున బైటికి పరుగెత్తుదునా? ఛీ ఛీ! ఇది శూరునకు తగదు. పోరికి జంకువాడను కాను.

ఖండో—ఇప్పు డీ సుమంగళివచనము పాడిసేయక పోవడ మాపజ్జనకము. చంద్రావళి సలహా ప్రకృతపరిస్థితు లలో పరమమంగళదాయకము. సాధారణు లెంతమంది సమ సినా వారి పాలకుడు బ్రతికియుండవలెను. రక్షణ మసంభవ మైనప్పుడు రహస్యమార్గము ననుసరించడము రాజనీతి. మీ శౌర్యము అనివార్యము, అకుంఠితము; ఐనా పగవారి సైన్యము అమితమై పైన బడ్డప్పుడు కపటోపాయమున గడప దాటడమే ఉత్కృష్టమార్గము. (తెరలో దీన్ దీన్.) అదిగో, దగ్గరపడ్డారు, దాటుదాము త్వరలో—(చంద్రావళి ముందూ ఖండోజి తరువాత ఆ వెనక సంభాజి పోతూం డగా అకస్మికముగా గోడ కూలి సంభాజీ లోపల ఉండి పోవును.)

గణో—పగ! పగ! పగ! పొగరుబోతా! ఇదిగో శిర్కే కసితీర్చుకొన్నాడు.

(గోడమీదినుండి దుముకును)

సంభా—శిర్కే! కులాంగారమా! ఇదిగో నీ పాతకములకు ప్రాయశ్చిత్తము.

(కత్తితో నరుకబోవ అరబ్బీలు రెక్కలు విరిచి కట్టుదురు)

గణో—జాగ్రత్త! మదోన్మత్తుడా! మృత్యుముఖమున పడిన నీకు ప్రాణాలపై ఆశ ఎందుకు? చావుకు సిద్ధపడు. నా బంధువుల జంపి కులనాశ మొనరించినావు. ఆ మానధనుల వంశజుడను నీ నేరములకు ప్రాణదండనము విధిస్తూన్నాను. తల వంచు.

సంభా—తులువా! మా ఛత్రపతుల శిరస్సు పాదుషా ఎదుటనైనా వంగదు, తుచ్ఛుడవైన నీ ఎదుట వంగునా? నీ బంధువులను నేను బహిరంగముగా కూల్చితిని కాని పిరికివాడనై పగవారి చెప్పులు మోసి కార్యము సాధించలేదు. నాపై పగ ఉంటే నాతో బాహాటముగా పోరుము. మగవాడు చేయదగినపని అది. ఆడదానివలె తురకలపంచ జేరి తులువా! నీ ప్రభువునకే గాక రాష్ట్రమంతటికీ ముప్పు తెచ్చినావు—నీబోటి కులపాంసను డుండబోడు.

గణో—బలవంతుడను గాన పరాక్రమను నీ చిత్తమున వచ్చినట్లు కూల్చినావు, నేను బలవంతుడనైనా ఒంటివాడను కావున బలిష్ఠుల నాశ్రయించవలసి వచ్చినది. నీవు ఉత్తమ కులద్రోహివి రాజవు; నే నుత్తమకులజుడను రాజద్రోహిని. ఇద్దరము సమాన పాపులమే. నీవు ఛత్రపతివైనా, మహారాష్ట్రసార్వభౌముడవైనా నిన్ను చంపక మానను—శివలింగముపై నున్న తేలుపై దయచూపుతారా?...నీ కులదేవతల స్మరించుకో—నీచావు దగ్గరపడ్డది—పాపసంచయము పరిహరించుమని పరమేశ్వరుని వేడుకో...(కత్తి నెత్తును).

(ఇక్లాస్‌ఖాను వచ్చును).

ఇక్లా—ఆగు శిర్కే—ఏమి చేయ నెంచినావు?

గణో—నా పగవానిని పరిమార్చుతాను.

ఇక్లా—వల్లకాదు—ఇతడు నీకు పగవాడైనా సరే కాని అతనిపై నీవు కత్తి నెత్త వీలులేదు.

గణో—ఖాన్‌సాహెబా! ఇంత మహాప్రయత్నము చేసి మహామ్మదీయసేనల రప్పించినది ఇతనిపై పగతీర్చుకోవలెననే—అది నేను మానుదునా?

ఇక్లా—మహారాష్ట్రసార్వభౌమునిమామూలుమర్యాదలతో మావద్దకు తేవలెనని పాదుషావారి యాజ్ఞ!

గణో—అందుకు కారణము?

ఇక్లా—ఇత డిన్లాముదీక్ష స్వీకరిస్తే పాదుషావారి ప్రాపు బడయగలడు.

గణో—ఈతనిపై పగదీర్చుకోవలెననే కదా పాదుషా వారి ప్రాపుకోరినాను. నా ప్రతిజ్ఞ పాలించకుండా విడుతునా?

ఇక్లా—పాదుషావారి ఎదుట నీపగ తీర్చుకో వచ్చును.

గణో—అయ్యో! రెండింటికీ చెడితినే!

(తెర వాలును).

---




# నాల్గో అంకము

## మొదటిరంగము

తులాపురంలో పాదుషా సేనామధ్యమున గణోజి.

గణో—అంతటా తురకలే! మహారాష్ట్రుడొక్కడూ లేడు. గోరుచుట్టుమీద రోకలిపోటు! తలయెత్తితే తురక ప్రత్యక్షము! వారిని చూస్తే అరికాలిమంట నెత్తికెక్కుతూన్నది—సంగమేశ్వరములో వీరు చూపిన స్వార్థపరాయణత కన్నులకు కట్టినట్లున్నది. సంభాజీపైని తీర్చుకొందామన్న పగ వీరిపై ప్రసరిస్తూన్నది. ఈసేనా సముద్రములో మునిగియున్న నేను దీని తరించడ మేలాగు? మనసులోని దుఃఖము పంచుకొనే మరాటావాడొక్కడు లేడు కదా? పాదుషా కోరిక తీర్చడానికి నేనొక సాధన మయినాను. నాకోర్కె తీరడ మేలాగు? పారా జవాన్!

జవా—క్యా హోనా?

గణో—నాకోస మెవ్వరైనా వస్తే లోనికి పం

(అతడు వెళ్లును)

తలవ్రాత తప్పించలేము—నే నార్జిన పాతకము పరిహారము నేనే చేయకపోతే నాకు చిత్తశాంతి లభించ చిత్తము స్వాధీనమైతే పసిబాలికవలె పరిదేవన ము నక్కర యుండదు. నా ద్వేషము దీర్ఘమై నన్ను దుః చేసింది—మహారాజుపై కసి చేత నిసర్గవైరి అని తలం మహమ్మదీయునితో మైత్రి చేసినాను. ఎండమావుల పారి ప్రాణములు గాయనున్న లేడిపిల్లవలె నెత్తురు కక్కు సిద్ధుడనై యున్నాను. పగతీర్చుకో లేకపోయినాను, స రేక ఆప్తులకు శత్రువు నైనాను; ఏకాకినై శత్రుసేనావారమునం జెండాలేని కొయ్యలాగు వ్యర్థముగా పాతుపడినాను. ప పంచను పదికాలాలు పడియుందా మంటే స్వాభిమాన సాగనీయకుండా ఉన్నది. ఊపిరి సలుపక గుండెలు చె లవునేమో అని సంశయిస్తూన్నాను. మావాళ్లను క మొగలుల ప్రయత్నము విఘ్నము చేతామంటే మహారా శత్రువుల కల్పించిన పాతకము నాకంటినది, అందుచేత ద దరికి రానీయరు. చెట్టున కుళ్ళి కిందపడిన కాయ తిరిగీ క కతుకుకొంటుందా ?...ఇతో భ్రష్టః తతో భ్రష్టః అన్నట్ల నా బ్రతుకు. మహారాష్ట్రవంశములకు అపకీర్తి తెచ్చినాన

తెరలో—(చాటింపు) పాదుషావారి పవిత్ర సేన తెల్పే దేమంటే—మొగల్‌సామ్రాజ్యమునకు ముఖ్య

శత్రువు సంభాజీగారిని బంధించి ఇక్లాస్‌ఖాన్ పాదుషావారి సమక్షమున నిలువబెట్టినాడు. ఈ సమయమున పాదుషావారి పరమసంతోషమును వ్యక్తపరిచే నిమిత్తము సైనికుల కందరికీ వారివారి చిత్తమువచ్చినట్లు తినడానికీ తినిపించడానికి తాగడానికీ తాగించడానికీ మందుగుండుసామాను యథేచ్ఛముగా వాడుటకున్నూ పూర్ణస్వాతంత్ర్యము ప్రసాదించినారు. కనుక అందరూ ఇష్టమువచ్చినట్లు చేయవచ్చును.

గణో—అబ్బా! కర్ణకఠోరములైన మాటలు. పంచప్రాణములూ భగ్గున మండుతూన్నవి. మహారాష్ట్రసార్వభౌముడు బంధింపబడి బానిసవలె పాదుషాయెదుట నున్నాడు! ఈ దురవస్థకు నేనేకదా కారకుడను. క్రోధమాత్సర్యము లినుమడించి నాకు వెర్రెత్తించినవి. క్రోధాంధతమసమందు నాకు యుక్తాయుక్తములు గోచరించలేదు. పగసాధించుకోవడమే చూసినాను కాని తత్ఫలము పరికించలేదు. విషబీజము విషవృక్ష మగును, దానిఫలము కూడా విషఫలమే...అబ్బా! ఎంత ఘోరమైన పని చేసితిని! నా అన్నదాతను చేతులారా పెద్దపులినోట్లో పెట్టినాను. ఇకనాతడు మాకు దక్కడు. కీడు చేయుట మతిసులభము, దానిని క్షమించడ మతికష్టము.

(మాల్వీ వచ్చును)

మాల్వీ—శిర్కేరాజాగారూ, మీహిందువులు అతిథిసత్కారమునకు పేరుపడ్డా రంటారే, మీరు నన్ను చూసి తిరస్కారభావముతో ఊరకున్నా రేమి?

గణో—అయ్యా, దయచేయండి. నామనస్సు చింతాగ్రస్త మయిందె...మాకు పరమతస్థులయెడ అసహనము లేదు. విధర్ములమైత్రి మనఃపూర్వకముగా అభినందిస్తాము. ఈ కారణముచేతనే మాదేశమునకు వచ్చిన పరదేశస్థులు మమ్ము విడిచి పోలేక ఇక్కడే స్థిరపడి ఇల్లూ వాకిలీ సంపాదించి కాలక్రమమున రాజ్యములుకూడా స్థాపించుకొన్నారు. ఇంతే కాదు—మా హిందువులకు అంతఃకలహములు పెంచుకోవడ మనే దీర్ఘరోగ మొకటుంది. అట్టి కలహములు ప్రాప్తించినప్పుడు మాలో మేము వాటిని తీర్చుకోలేక విదేశీయులు విధర్ములునైనవారి సహాయమున మావాళ్లపై పగ దీర్చుకొంటాము. అదే తగిన అదనుగా గ్రహించి వారు మా రెండు తెగలవారిని మచ్చమాపి మాకన్న బలవంతు లవుతారు. సంభాజీమహారాజు పాదుషావారికి అతిసులభముగా వశ్యుడు కావడమే ఇందుకు నిదర్శనము.

(తెరలో పూర్వపు చాటింపు)

పరులమైత్రినాసగొని స్వీయుల నెట్లు మేము ధ్వంసము చేసుకొన్నామో ఈ దండోరా విన్నవారికి విదితమవుతుంది.

మాల్వీ—(చెవులు మూసికొని) హిందువులే తమ రాజు నిట్లు పరుల కర్పించినారా! ఎంత కష్టము! ఎంత కష్టము!

గణో—మీా జాలిగుండె చూసి మాకు లజ్జావహమైనా సత్యేతరముకాని ఈ వృత్తాంతము విన్నవించి నా

మనోవ్యాధి కొంత తీర్చుకొంటాను. మహాపాతకమైన ఈ రాజద్రోహము, ఈ విశ్వాసఘాత చేసినవాడు కులీనుడూ రాజబాంధవుడూ ఐన ఒక మహారాష్ట్రుడు.

మాల్వీ—ఇంతటి పాపాత్ము డెవడు? తన ఇంటికి నిప్పంటించడానికి అతని చేతు లెట్లు వచ్చినవి! బంధుద్రోహము, రాజద్రోహము ఐన ఈ కృత్య మమానుషము. ఇవి రాక్షసులకే తగును.

గణో—పగ అనే క్రూరపుచేత అతనిమతి చెడిపోయినది. సంభాజీకి ఘాత చేయవలెనని మత్సరముచేత పొరగప్పిన అతని మనస్సుకు తన పనివల్ల మహారాష్ట్రమే మవునో స్ఫురించలేదు. అత్యంత మత్యంత నాశక మని అతని కప్పుడు తోచలేదు.

మాల్వీ—ఆ నష్టకారి ఎవ డండీ?

గణో—ఆ ద్రోహి, ఆ పాపాత్ముడు, ఆ యధముడు నువ్వే.

మాల్వీ—దైనాంశ లేక రాజు కాదని కృతవిశ్వాసముగల మీా హిందూరాజ్య గర్భమునకు భారభూతుడవై నీ రాజేశ్వరుని ద్రోహపాశమున కట్టి శత్రువులకు కైదిగా అర్పించినావా? నీ జీవిత మెంత వ్యర్థము చేసుకొన్నావు! కసాయివానికన్న కఠినుడ వైతివే!

గణో—ఇప్పుడు నన్నేమంటే ఏమి లాభము? నా పాపపరంపరోత్తుంగతమము ప్రాయశ్చిత్త పతంగుని చేత ధ్వంసము చేయుడము తప్ప వేరుపాయము లేదు.

మాల్వీ—గొప్ప గోతిలో పడ్డప్పుడు బెడ్డవేయడము హీనపధ ర్మమైనా పశ్చాత్తాపాగ్నిచే తప్తుడవైన నీయెడ జాలిపుట్టి నన్ను కార్య ప్రవాహమున త్రోసి నీవుచేసిన ఈ ద్రోహమునకు ప్రతిక్రియ చేయడమువల్ల ప్రయోజన ముం దని ఎరిగి నీకు బోధచేయ వచ్చినాను.

గణో—మీరు సహృదయులు కావున అపర చితులైనా నాపై జాలిగొన్నారు. ఇది ఉదారుల లక్షణము... ఇక నా మాట—ముందు జరిగే ఘోరకార్యసంచయము నా కళ్లకు కట్టినట్లుంది—క్రూరాత్ముడైన పాదుషా సంభాజీకి యమయాతన తెచ్చితీరును—సంభాజీ వీరశిఖామణి; అతని మతాభినివేశము మెచ్చదగినదైనా మరియొకరియందు కాన రాదు. అట్టి హిందూమతదీక్షాపరతంత్రుని ఇస్లాముమతము స్వీకరించుమని పాదుషా ఎట్టిబాధలు పెట్టునో కదా! ఒక్కొ క్కటి తరచిచూస్తే సంభాజీపై నాకున్న కోపమూ ప్రతి క్రియా పరాకాష్ఠా పాదుషాపైకి దాటుతూన్నది. పరిస్థితులు అనుకూలిస్తే ప్రాణాపాయము పాటించక పాదుషాపై పగ దీర్చుకొంటాను, కాని ఇది గొంతెమ్మ కోరిక.

మాల్వీ—దేశకాలము లనుసరించి వర్తించవలెను, లేకుంటే ప్రమాదము. అన్యాయవర్తనులయెడ కోపము యుక్తమే, ఇష్టానిష్టపరిణతి మాత్రము గణించవలెను.

గణో—బ్రతుకంతా వ్యర్థపరుచుకున్న నాకు ఇష్టా

నిష్ట విచక్షణతో పనిలేదు. పాదుషా అంటే ఆపాదమస్తకమూ మండిపోతూన్నది.

మాల్వీ—ఇప్పుడు మీరు ప్రమత్తులైతే ప్రయోజన మేమీ లేదు. సం౹ మేశ్వరమున ఇక్లాస్‌ఖా నడ్డు రాకుంటే మీరు సంభాజీని చంపియుందురు కదా? అదిప్పుడు పాదుషా చేయనున్నాడు. ఏలాగైతేనేమి సంభాజీచావు తప్పనిసరి—. పాదుషాపైని మీకు పాపచింత ఎందుకు?

గణో—పాదుషా నన్ను నమ్మించి మోసము చేసినాడనే నాకు క్రోపము.

మాల్వీ—ఇందులో మీ తక్కువ ఏమి? ఇద్దరూ స్వార్థపరులు, ఏకకార్యావలంబకులైనారు. అతడధికారి కావున మీ యిద్దరికీ మోదావహమైన కార్యమునను చేయ నెంచినాడు—ధార్మికత లేక కార్య పరతంత్రులైనప్పుడు వారికి సమిష్టి కుదురుతుంది; స్వార్థపరుల కట్టియెడ వ్యష్టి అలవడుతుంది కాని కలయిక కలుగదు—కార్యపరిణతి అయ్యేవరకూ కలిసి ఉంటారు, తీరా కార్యము ముగించేసరికి ఒకరి నొకరు కబళించ యత్నిస్తారు. వారికి పోరాటము తప్పదు... దాని కేమి — శిర్కాణ్ జాగీరు సంకల్పమున సంభాజీ మీకు శత్రువైనాడు, అతనిని చంపవలెనని మీ కుద్దేశము కలిగింది. అందు కడ్డుతగిలినందున కదా ఆ క్రోపము పాదుషామీదికి పరుగెత్తింది. ఇప్పుడు సంభాజీయెడల మీ కనుతాపము కల్గింది. వ్యక్తిద్వేషమువల్ల పగవారి సాయము కోరి ఒక్షీణ

సామ్రాజ్యము ధ్వంసము చేసినాడు కదా అని యిప్పుడు మీరు చింతిస్తూన్నారా... మనోవికారములు మట్టుబెట్టి స్వార్థ మహామంత్రము సదా జపిస్తూ భేదోపాయమున తనకార్యము నిర్వహించుకోవడమే పాదుషావారి నీతి... అది అలా గుండనీ— మొగలులయెడ మీకు నిస్వార్థమైన శత్రుత్వ మున్నది కదా? శంభురాజును పట్టి పిడిపించి పాదుషాకు పగ సాధించ రాదా?

గణో—మీ రెవ్వరో ఎరుగలేకున్నాను... విధర్ములైతే మా రాజుగారిమీద మీ కింత విశ్వాస మెందుకు? జాతి మా పగవారిది, వర్తనము మాది. ఇదెట్లు సంభవించును? పాదుషా నా గుట్టు తెలుసుకొనుటకై పంపిన గూఢ చారుడవా? లేక నా వలెనే మొగలులచేత మోసగింపబడిన హిందువుడవా? ఎవరవో చెప్పు.

మాల్వి—దైవానికి దురవగాహము. ఏ మని చెప్ప గలను? రాజకార్యదూర్వ్యతమున శంభురాజును చేతులారా ఓడి,చావుకు వెనువడినాడనై నా ప్రాణాధికమైన వాంఛ సఫల మయ్యేనిదాకా దైన్యజీవనమున బ్రతుకనెంచి దౌర్భాగ్య దశలో నున్నందున మాల్వివేషము వేసినాను. అజ్ఞాతవాస దీక్ష వహించిన పాండవులు అకాలమున బయలుపడితే వారి గతి ఏమై యుండును?

గణో—నే ననుమానించినట్లే అయినది— మొగల సేనావారము చొచ్చిన మహారాష్ట్రుడవా?

మాల్వీ—చిత్తము. సంగమేశ్వరముతోవలో గుర్రపు దళముతోడు జేసుకొని మీరు మహారాణిగారి సవారి నెదిరించగా ఆమె నా యూపనుండి తప్పించి రాయగడము చేర్చి “మహారాజుగారికొరకు బెంగవద్దు; వారిని త్వరలోనే వెంట బెట్టుకొని వస్తా”నని నచ్చచెప్పి ప్రస్తుతము ఏకాకినై ఆ సాధ్వి యెదుట పడవలసిన భాగ్యహీనుడను—ఖండోజీని—మహారాజు గారి ప్రాణభిక్ష గాంచి రావలెనని మీాదరి జేరినాను. సంభాజీ మహారాజును సంగ్రహింపనేరక నా ఏభ్రాసి మొగము రాజా రామ్‌గారి కేలాగు చూపుదును? మహారాణిగారి కేమి సమాధానమివ్వగలను? ముద్దులమూటకట్టు బాలరాజుగారు తండ్రిగారిని చూపు మను కింకవట్టితే ఏమని బుజ్జగించగలను?

గణో—ఈశ్వరా! నాకీ లజ్జాస్పదమైన బ్రతుకు వద్దు. మూర్తీభవించిన స్వార్థత్యాగమో అన్నట్లు నా మొదుట నిలిచిన ఈ మహాత్మున కేమి సమాధాన మివ్వగలను? జీవచ్ఛవప్రాయుడనైన నన్ను నిష్కళంక నిరాతంక స్వామిభక్తుడైన ఈ మహాపురుషుని ఎదుట నిల్పడముకన్న నాకు మరణము ప్రసాదిస్తే దైవమా! యమయాతన మాన్పినవాడ వగుదువు.

ఖండో—పశ్చాత్తాపోద్రేకమున మరణము కోరితే భగవంతుడది ప్రసాదించునా? కేవల పశ్చాత్తాపము చాలదు. అది కార్యరూపమున పరిణమించవలెను.

గణో—సంభాజి రాజు కాకపోయినా, నేను ఒంటరినై

అతనిపై పగదీర్చుకొన యత్నిస్తే నాపని లక్కికి లిక్కి అయి యుండును. ఎన్నో తరములనుండి హిందువులకు శత్రు చూపులైన మహమ్మదీయులకు మనరాజు నర్పించి రాష్ట్ర మంతా ధ్వంసము చేయడానికి వాళ్ళ కనకాశము కల్పించి తగని తల్లడము కోరి తెచ్చుకొన్నాను. ప్రమాదవశమున కొంపకు నిప్పంటితే అది ప్రజ్వరిల్లక ముందు దానిని సుల భముగా ఆర్పవచ్చును. నా మూఢ్యముచేత అగ్నిపర్వతమే పగిలింది. ఏమీ చేయనేరని బాలునివలె బెగడొందుతూ న్నాను. నాచేత నే మవుతుంది?

ఖండో—నిరాశ చెందకండి. ప్రాణ మున్నంతవరకూ ప్రయత్నము మానరాదు. బడబానలము సముద్రములో తొక్కి హాలాహలము కంఠమున భరించినట్టి పరమేశ్వరుని దయ అపరిమేయము. భవిష్యత్తు గర్భమం దేమి ఇమిడి యున్నదో ఎవ రెరుగుదురు? నిరుపాయులని యెంచి నిరాశా పరవశులై కర్తవ్యపరాఙ్ముఖులైనవాళ్లు కృతకృత్యులుకాలేరు.

గణో—సాధారణమానవకృత్యము నా పాపపంకమును తుడిచివేయలేదు; ఏదైనా అతిమానుషకర్మ చేయవలెను, నా ఆర్తి తీరవలెను.

ఖండో—పాపపరిహారమున కొక్కటే సూత్రము. పాదుషాపిడికిట బెగ్గిలుచున్న మహారాజును విడుదలచేయ డమే. సర్వశుభప్రదమైన ఆ మహత్కార్యమే మీకు తప్ప కుండా చిత్తశాంతి చేకూర్చగలదు.

గణో—నా దౌర్భాగ్యవశమున ఆ త్రోవ కప్పబడ్డది. అట్టి అవకాశమే ఉంటే సంభాజీని బంధించిన సంకెళ్లు పటాలున తెంచి యుందును. గతమున కార్యభంగము కావించుకొన్న పాదుషా అట్టి విపరీత మేమీ జరుగకుండా జాగ్రత్త పడ్డాడు. మన మహారాజును తన కళ్లయెదుట కారాగారమున ఉంచి చుట్టూ మనకు నిసర్గవైరులైన పఠాను రోహిలా సిద్దీ పటాలములతో షేక్ నైజామును అహోరాత్రములు కావలి వేసి మన రాజును వజ్రపంజరమున భద్రముగా బంధించినాడు. అతని విడుదల అసంభవము, అసాధ్యము.

ఖండో—అయ్యో! నా ప్రతిజ్ఞ వ్యర్థమేనా? ఈ పాపుల సేనాసముద్రమున దుమికినానే కాని చేతులు నులుముకొంటూ చేష్టలు దక్కి యుండవలసిందే? ఇక నేను జీవించిన లాభ మేమి? ఇంతవరకూ వచ్చి ఊరకపోనేల? ప్రాణములమీద ఆశ లేనే లేదు...అయ్యో! మనరాష్ట్రమున అరాజక మారంభ మవుతుంది, అంతఃకలహములచే రాష్ట్రము నశించే దినములు రాకుండా మన చేతనైనంత పాటు పడుదాము. మీరు మాతో కలిసి మహారాజుగారిని విడిపించే యత్నము చేస్తారా?

గణో—అది వ్యర్థప్రయత్నమని అలాగు చెప్పినానే కాని నాకు సమ్మతిలేక కాదు. ఇదివరకు చేసిన ద్రోహమే చాలును నన్నాచంద్రార్కము నరకములో త్రోయడానికి.

ఇప్పుడేనా బుద్ధితెచ్చుకొని మీతో కలిసి పాటుపడుతాను. నాతల దిమ్మెత్తింది, రక్షణోపాయ మేదీ స్ఫురించలేదు; నీవే నా కది ఉపదేశించవలెను.

ఖండో—అలాగే కాని మి మ్మొక టడుగుతాను చెప్పండి...మహారాజుగారికి ఆహారము తీసుకొనిపోయే వానిని మంచిచేసుకొనుటకు కాని, పాదుషావారి కమిత ప్రేమభాజన మైన జనతున్నిసాను దర్శించడానికి కాని వీలు లేదా?

గణో—ఇది మంచి ఉపాయమే. వా రిద్దరినీ చూడ వచ్చును. కాని నే నొక్కమాట ముందే చెప్పుతాను, కోప గించుకోవద్దు. నేను పాపాత్ముడను, ఏవేళ కే దుష్కర్మ చేతునో చెప్పలేను. ఈ మహత్కార్యము నా నెత్తిపైని పెట్టి తే అందేమి చెడగొట్టుదునో తెలియదు. ఇప్పుడే మహా రాజును విడిపించగలమనే ఆశ మినుకుమినుకు లాడుతూన్నది. నా దౌర్భాగ్యవశమున అది ఆరిపోయి మహారాజు కెక్కువ కీడు దాపురిస్తుందేమో? మనము చేయదలచినది సత్కార్య మైనా నే నందులో తలదూర్చితినా అది దుష్కార్యముగా మారి మన అవస్థను మరింత హీనముగా మార్చును. కాబట్టి నన్ను తటస్థునిగా ఉంచి యావత్కార్యము నీవే నిర్వర్తించు. నా శక్తికొలది వాక్సహాయము చేస్తాను. నీమాట మీరను.

ఖండో—సరే, మీ ఇష్టమువచ్చినట్లే కానీయండి.

---

## రెండవ రంగము

### పాదుషా స్కంధావారమునందు డేరాలో సంభాజీ

సంభా—సృష్టి తల్లక్రిందై పోయినది, లేకుంటే నా జీవితము ఇట్లు వక్రగతి పట్టునా? మేటిశూరుడనై వ్యర్థునివలె శౌర్యాలాపము లాడుతూన్నాను. అహో! దైవమా! రాజ కార్యమహావార్థి ననుసూనకౌశలము గల నావికుని రసాతల మునకు క్రుంగించితివా?... మాయామేయమైన ఈ జగత్తున జయప్రదమైన చారిత్రము, అనాయాసము సగౌరవమైన మృత్యువున్నా ఎక్కడో అదృష్టశాలికి ఘటిల్ల చేస్తావు కాబోలు!... సంభాజీ—నీవు స్వాభిమానివి, ఉద్యోగిపరుడవు, క్రూరస్వాంతుడవు—నిసర్గసగుణుడవే కాని విచక్షణుడవు కావు. మానవస్వభావపరిశీలనాపటిమ యెందుకైనా నీయందు లేదు. అయోగ్యులను చేరదీసి పెడదారి పట్టినావు. స్వీయులను విశ్వ సించక పరులను నమ్మి పాడయినావు. నిశ్రేయోభిలాషులను చెంతజేర్చక యుక్కుమోము వంగని నికృష్టోపజీవుల వ్యామోహమున బడి వ్యసనాసక్తుడవై పేరు చెడగొట్టు కొన్నావు. కాలచక్రమునకు కనికరము మన్నన లేదు. శిరశ్ఛే దమే నీ కర్హమైన శిక్ష. ఇదిగో నీ అపరాధమాలిక—ఆబా సాహెబుగారివలె భుజముకల్పి పోరినవాళ్లు, సామ్రాజ్యస్థాప నకు మూలస్తంభములై తమప్రాణములను త్యజించినవాళ్లు నిష్కారణముగా నీచేత వధింపబడిన మహనీయులు ఎందరో

కలరు—ఇదిగో అన్నాజీరక్తాప్లుతము చింతనిప్పులుబోలు కళ్ళతో ఏలాగు చూస్తున్నదో! శిర్కేలు పటపట పళ్లు కొరుకుతూ పగతీర్చుకొనుటకై పిడికెళ్లతో పొడవనున్నారు! మరపులేనుగ కాలుక్రింద మడిసిన బాలాజీ ఆవజీ అతినిష్ఠురమైన ధ్వనితో "రాజా! శివాసాహెబుగారు అతిప్రయాసతో మహారాష్ట్రసేనాసముద్రము మథించి సేకరించిన వీరరత్నములను చంపుతూన్నావు, ఇక నీసేన విశృంఖలవృత్తితో విహరించి నీ గౌరవమునూ ప్రతిభనూ గంగలో కలుపును. అప్పుడు వీళ్ళకొరకు భోరున నీ వేడ్వవలసి వచ్చును" అని అంటూన్నారు. అదిగో కుడ్యస్థాపితమైన నా సతీతల్లి కరుణాక్రందనము. మహారాణీ, నేనే సచ్ఛీలుడనైతే మీకు నాపై సహితానురాగ మిగిలియుండును. స్వయంకృతాపరాధములచే సంభాజీ వ్యర్థుడని తేలిపోయింది—అన్నపానములివ్వక పలువుర సంతాపమొదవించిన సంభాజీ ఇక బ్రతుకడు... నిశ్చయముగా నాకు కూడా బ్రతుకవలెనని లేదు. ఈశ్వరా! స్వాభిమానికి తగిన మృత్యువు నాకు ప్రసాదించు...అయ్యో! నా కెట్టి కష్టగతి ప్రాప్తించింది! చిన్నతనమున మూర్ఖునై తండ్రిగారి ప్రేమకు తప్పితిని—పడుచుదనమున పాడుమిత్రుల పాలబడి ప్రాణసమానులైన బంధువుల ప్రేమకు దూరపడనైతిని—భగవానునివంటి భ్రాతను పదేళ్లు బంధిఖానాలో బంధించి ప్రజాప్రేమ పోగొట్టుకొన్నాను. ప్రాణాధికమైన భార్యను ప మాటలతో తన్ని పగగొని వచ్చి నానుసాచేతిలో పడ్డాను.

తండ్రినీ పోషకునీ చంపి సర్వస్వము నపహరించినా తప్పులు మన్నించి నిరుపమభక్తితో సేవించిన ఖండోజీ మాట...

(ఖండోజీ వచ్చును)

ఎవరది? ఖండోజీ!

ఖండో—మహాప్రభూ! నేనే!

సంభా—ఎందుకింత సాహసము! ఈ వేష మెందుకు వేసినావు?

ఖండో—మహారాష్ట్రసామ్రాజ్య పునర్వృద్ధికి మహత్తరమైన గాంభీర్యము ముఖ్యమైన ఉనికి అని నా అంతర్గతమైన కృతజ్ఞత ప్రేరేపించగా ఈ కపటవేషము వేయవలసి వచ్చింది. భగవంతుడు ప్రత్యక్షమానవునిగా పరీక్షిస్తూన్నా పాండవుల కజ్ఞాతవాసము తప్పలేదు.—రాజరాజేశ్వరా! ఇది ఈశ్వరసంకల్పము—మీ అన్నము తిని పెంచిన ప్రాణము లని విర్రవీగే నేనీ నాటికి మీ శత్రువుల అన్నము తిని మారువేషముతో విద్వేషుల మధ్య నివసించవలసి వచ్చింది!

సంభా—ఖండోబా! కశ్యపప్రజాపతి కడుపున దైత్యులూ దానవులూ పుట్టినట్లు, జగజ్జీవనదాత సూర్యుని కడుపున శని పుట్టినట్లునన్నా ఛత్రపతి శివాజీ మహారాజు కడుపున బుట్టి వారి గుణములు కూడా చెరచినాను. అట్టి నిర్భాగ్యుడైన సంభాజీకొరకు నీ వెందుకు శ్రమపడుతూన్నావు? ఇదివర కొకసారి నా ప్రాణములు కాచినావు. మొన్న సంగమేశ్వరములో శత్రుబృందమును సరకుచేయక

నీచేత నా సంతోషమునకూ నన్ను కాపాడ యత్నించినావు, కాని నా భాగ్యము లేకపోయినది—తిరిగి నేను పాముపాకో పానలమున శలభము వలె తెలిసి మీరాదిన పని తలపెట్టినావు. నీవంటి నిష్కల్మషస్వామిభక్తులగు సేవకుల విలువ నేను కనిపెట్టలేక పోతిని. ఎన్ని జన్మలు నీ కడుపున పుట్టినా నీ ఋణము తీర్చ లేను.

ఖండో—ప్రభూ! మీరు మా కొనర్చిన మహోపకారము ముందర నా కృత్య మేపాటి! సిద్ది రాజు మా కుటుంబము నెల్ల ఓడలో ఎక్కించి పరదేశములందు వాడు బానిసలుగా అమ్ముటకు నిశ్చయించి నప్పుడు ఆ స్వత్రాణపరాయణులైన ఆబాసాహేబుగారు కష్టపడి మా పిల్లలను చేరదీసి పెంచినారు. అందుమూలముననే మా కుటుంబమునకు ప్రఖ్యాతి వచ్చినది—ఆ ఋణము తీర్చడానికి నేను చేయరానిదేమైనా ఉన్నదా?

శంభా—నీ వేమీ చేయ నక్కరలేదు. ఇటుపైని నాకొరకు మీ రేవిధమైన శ్రమ పడనక్కరలేదు. నా మాన్యులైన మీరు నా అపరాధము లన్ని మన్నించి ఆబాసాహేబుగారికి కూడా నాయెడ కన్పరచిన అభిమానము, అపేక్షలతో నమస్కరించినాను—మీ రాజభక్తి పరమావధి నొందింది. నాయనా, నీవు వచ్చినట్లే పో. ఇప్పటికన్న దారుణమైన అనిష్టపరంపర మహారాష్ట్రమును దాపురించ నున్నది—పనికిమాలిన నాకొరకు మీరు ప్రాణములు త్యజించవద్దు—సురక్షితముగా రాయగడము చేరి రాజారామ్‌తో—"మహా

రాష్ట్రమునకు నీవే తగిన సార్వభౌముడవు—ప్రభుత్వమంతా నేను పాడుచేసినాను, దానిని సవరించుకొనే బాధ్యత నీది" అని నామాటగా చెప్పు—ఇక రాణీగారితో "పాదుషా నన్నూ మహారాష్ట్రమునే కాక సర్వహిందూమతము సమయ జేసి ఇస్లాముమతము ప్రతిష్ఠింప నెంచినాడు—నీ మాట వినక నేను చెడినానని దైవసాక్షిగా చెప్పగలను—నామూర్ఖత్వము మన్నించ ప్రార్థిస్తూన్నా"నని చెప్పు.

ఖండో—మీకింత నిరాశ ఎందుకు మహాప్రభూ?

సంభా—ఖండోజీ, నాజన్మము వృథా! అరిషడ్వర్గము నదుములేక అమితాపచారము కావించినాను. దుస్సహవాసమున దుష్టుడనై పయోముఖవిషకుంభమైన కబ్జీని నమ్మి కాలునివాత పడినాను. దుర్విషయాసక్తి నన్ను దుండగుని చేసింది. అష్టప్రధానులను రూపుమాపి అధికారమంతా ఆ యపాత్రుని నెదాన పెట్టినాను, అందుమూలాన మహారాష్ట్రము నిరంకుశరాజకమై రంధ్రాన్వేషులకు సుగమమైనది. బంధువులతో పగ, పగతురతో యుద్ధము—వీటితో నా కాలమంతా గడిచింది, చిత్తశాంతి చిన్నమెత్తైనా లేదు. ఇక బ్రతికి ఏమనుభవించగలను? యోగ్యుడైన రాజు కుండవలసిన సుగుణ మొక్కటైనా నాకు లేదు; అందుచేత ఇక బ్రదుకుపై ఆశ లేదు. త్రికరణశుద్ధిగా చావవలె నని నిశ్చయించినాను—ఇక నాకొరకు ఎవ్వరూ పాటుపడవద్దు.

ఖండో—ప్రభూ! నా మనవి చిత్తగించండి—మీరు శత్రువులకు చిక్కారన్న వార్త రాష్ట్రమును అట్టుడికించి నట్లు చేసింది—ఆ కల్లోలము మిమ్ము చూస్తేనేకాని పోదు. శక్తికొద్దీ మంచి చేసుకొని యువరాజ్ఞి జనతున్నసాగారి ప్రాపు సంపాదించి మిమ్ము విడుదలచేసే ఏర్పాటు జయప్రదముగా జరిగించినాను. పాదుషావారు మీ విషయము విచారణ చేయు డానికి ఇంకా వ్యవధి ఉంది. ఇంతలో మన సైన్యము వచ్చి "జయోవా మృత్యుర్వా" అని నిర్ధారణ చేసుకొని వీళ్లపై నకస్మాత్తుగా చీకటిలో పడి మిమ్ము తప్పక విడిపించగలదు.

సంభా—స్వమతోద్ధారణకు ప్రాణము లర్పించే భాగ్య మనూహితముగా నాకు ప్రసాదిస్తూంటే నేను దానికి పరాఙ్ముఖు డనై సిగ్గు మాలి రాయగడము చేరవలెనా? కొరగాని కొడుకు కులమునకు చెరుపు. నేను మానవలీలముందర పడలేను. నాచే ఇస్లాము మతము స్వీకరించచేయడానికి పాదుషా పలువిధముల పాటుపడుతూన్నాడు. అదంతా వ్యర్థ మనిన్నీ హిందూరాజు లకు ప్రాణముకంటె మతమే ఎక్కువ ప్రేమపాత్రమని నిదర్శ నము చూపించి నాజన్మ సార్థకము చేసుకొంటాను.

ఖండో—మీ యభినివేశము ప్రశంసనీయమే—కాని మహారాజా! ఆచంద్రార్కము హిందూమతము నిలువబెట్టి ఉద్ధరించవలెనని కదా ఆ బాసాహెబుగారు మనరాష్ట్రము ప్రతిష్ఠించినారు. దానిగతి ఏమి కానున్నదో మీరాలోచించ వలెను—యువరాజు పసిబాలుడు, రాజారామ్‌గారికి రాష్ట్ర

పాలన మపరిచితము, కార్యకుశలులైన సర్దారులు కాలముచేసినారు, కొందరు కొలువు మానుకొన్నారు, వారిని మీరు ఉపేక్షిస్తే జీవనోపాధి లేనందున వారు శత్రుపక్షము చేరవలసి ఉంటుంది. ఇట్టియెడ దేశమందలి సంక్షోభము నడిచి పరిపాలనాకలము గలుగు నావికు డేడీ? ఇట్లు దేశ మారాజ్యమూడు కాగా పాదుషా ప్రభావము నిరంతరాయముగా సాగి అతడు కృతకృత్యుడు కాడా? మహాప్రభూ! మరణ మాశించి మహారాష్ట్రమును మట్టిలో కలుపుతారా?

సంభా—ఖండోబా, నీవు కేవలవీరుడవే కావు, రాజకార్యప్రవీణుడవు, రాజ్యతంత్రనిర్మాణచతురుడవని స్పష్టమైనది— కాని నీయత్నము సఫలమై నాకు బంధమోక్షమా నని ఏలాగు నమ్మడము?

ఖండో—జయము ఉత్సాహమును యత్నమునూ అనుసరించి యుండును. మనశక్తి కొద్దీ పాటుపడుదాము; భోంసలేకులదేవత భవానీమాత సర్వసమర్థురాలు!...ఆమె కృపచే జయము మనకు ప్రాప్తించగలదని మా అందరికీ ఆశ ఉన్నది.

సంభా—కానీ, నన్ను నిరుత్సాహపరచను—భవానీ దేవిపై భారము వేసి ప్రయత్నము చేతాము—నీకు జయమగుగాక! (అతడు పోవును) ఆహా! తానొకటి తలప దైవ మన్య మొనర్చును. ఏ దేలా గున్నా ఖండోజీవంటి స్వామిభక్తులు, సంతాజీధనాజీలవంటి శూరులు, ఖురాజీ రామచంద్ర

పంత్ వంటి రాజ్యకార్యప్రవీణులు—ఏరాష్ట్రమున నుందురో దాని కుత్కర్ష సంభవించితీరును.

(తెరలో) "దగా, దగా, పరుగెత్తండి, పట్టుకోండి."

ఏమి టీ గోల? ఖండోజీ నన్నొగూ పోల్చుకో లేదుకదా!

(ఇక్లాస్‌ఖాన్ వచ్చును.)

ఇక్లా—రాజాసాహెబా! ఇప్పు డిక్కడికి వచ్చిన వారెవరు? మీ భోజన మెవరు తెచ్చినారు?...మాటాడ రేమి?...మీరు చెప్పకపోయినా చింతలేదు. ఇక్కడి కెవరు వచ్చినారో, ఎందుకు వచ్చినారో—అంతా సవిస్తరముగా కబ్జీ చెప్పినాడు. మారువేషమున నున్నంత మాత్రమున ఖండోజి కబ్జీ కంటిలో దుమ్ము కొట్టగలడనియా మీ ఊహ? ఇట్టి జిత్తులవల్ల మీ కార్యము నెరవేరదు సరేకదా, పాదుషావారి కోపము హెచ్చినది. ఐదారుదినములకు రాబోవు మృత్యువు మీకు నేడే కలుగనున్నది. (పోవును)

సంభా—ఈ కబ్జీ బ్రతికి ఉన్నంతకాలము మహారాష్ట్రమునకు శని వదలదు—ఈ విషసర్పము తలప్రాణము తోకకు వచ్చినా కాటు వేయకమానదు—నన్ను చంపితే వాడి కడుపు నిండదు—ఇదంతా స్వయంకృతాపరాధమే—మొదటి నుండీ దుస్సాంగిత్యమే నా దుంప తెంపినది.

(తెరలో) పాదుషావారు దయచేస్తున్నారు హుషార్

అదిగో దండధరుడు వస్తూన్నాడు—నా కాయువు సరి—భవానీదేవీ—మహారాష్ట్రమును కాపాడు తల్లీ!

(పాదుషా పరివారముతో వచ్చును)

ఔరం—ఇతడేనా శివాజీ శూరపుత్రుడు?

ఇక్లా—ఔను—మహాప్రభో!

ఔరం—నిర్భత్యస్వభావుడు, వీరవ్యాఘ్రుడు, సుందరుడు! ఇట్టివాడు ఇస్లాముమతము స్వీకరిస్తే హిందూదేశమంతా ధన్యమగును. ఇట్టి మహానీయు నాశ్రయించి నీచుడు విశ్వాసఘాతకుడూ ఐన కబ్జీ ఇతనినే భంగపరచినాడు...(ప్రకి) ఏమండీ మహారాష్ట్రసార్వభౌములు!

సంభా—(పెడ ముగముననే ఉండును)

ఇక్లా.—ఏమండీ, పాదుషావారు పిలిస్తే పలుకరేమి? తెలివితెచ్చుకొని వినయ విధేయతలతో వర్తించండి.

సంభా—పట్టెడన్నము నాసించి పసులపంచ జేరి బ్రతుకదలచినవారు ప్రభువుల నాశ్రయించి వారి యనుమతి చొప్పున మెలగవలెను—సేవకుల కది ధర్మము.

ఔరం—శూరాగ్రేసరా! నిజము—వేటకాని తుపాకి దెబ్బవల్ల గాయపడిన పెద్దపులి వానిపైకి లంఘించడము స్వాభావికమే—నీ స్వాభిమానము మా అనురాగమునకు హేతువైనది—పరవంచనచేతనే మీకిట్టి అవస్థ చేకూరినది, కాని దీనిని దాటే ఉపాయము మీ వశమున నున్నది—అందువల్ల పరమేశ్వరుడు మేలు కూర్చగలడు—

సంభా—అట్టి ఉపాయ మేదో వినగోరుతున్నాను.

ఔరం—తప్పు దోవల పోక యదార్థమైన ధర్మము నాశ్రయించినవారికి భగవంతుడు మేలు కూర్చును. సత్యమైన ఇస్లాముమతము మీరు స్వీకరిస్తే మీకు గొప్పపదవి నొసగ దలచినాను.

సంభా— స్వార్థపరత్వావిష్టమైన పరధర్మానురక్తి స్వమతాభినివేశముచే అన్యమతావలంబనము చేయించు ననే భ్రాంతి వదలిపెట్టండి—పరవులనే ఎరచూపి భారతవర్షమున ఇస్లాము మతము ప్రసరింపజూస్తున్నారా? హిందువులందరూ పరోచ్ఛిష్ఠ భోజులవుతారా? ఈ మహారాష్ట్ర కేసరీకిశోరము స్వధర్మము విడిచేది కాదు.

ఔరం—పలుమాటలేల? ఇస్లాముమతము స్వీకరించ నిష్టపడితివా తక్షణాపథమునకు నిన్ను సుబేదారుని చేస్తాము. ఈ గౌరవమెవరికీ హిందువునకూ చేయలేదు—మొగల యువరాజులకు తగిన పదవి అది.

సంభా—నేనూ ముడిమాట చెప్పుతాను. స్వమతాభినివేశము రాజులకు విధి. అది మానినవారు అంతా పోగొట్టుకొన్నట్లే—సుబేదారు పదవి యిచ్చి సేనకోత్తమునిగా గౌరవించినా, లేక కూతు నిచ్చి బంధువుగా బహూకరించినా నేను ఇస్లాముమతము స్వీకరించను. ముమ్మాటికీ నిజము—

ఔరం—సైనికులారా! ఈ కాఫరును గాడిదె మీద నెక్కించి ఊరంతా త్రిప్పి తీసుకొని రండి... ఆఁ మరచితిని, కబ్జీకి కూడా ఇట్టి గౌరవమే కావలెను—మిత్రులను ఎడబాప

కూడదు...మూర్ఖా! నీనిర్లక్ష్యభావమునకు శిక్ష అయింది. నోటుపడితనమునకు నాలుక కోయిస్తాను.

సంభా—నీ చిత్తము వచ్చినట్లు చేయవచ్చును.

ఔరం—అటుపిమ్మట నీ దుండగమునకు చిత్రవధ చేయిస్తాను. కబ్జీకి కూడా ఇదే శిక్ష!

సంభా—నన్నెలాగు బాధించినా సరే—ఈ సంభాజీ స్వధర్మముకొరకు ప్రాణములు త్యజించి హిందూసామ్రాజ్యమునకు సంధానసాధకమైన మహాత్మ్యభావోన్నతిని స్థాపించి తీరును.

స్వస్తి ప్రజాభ్యః, పరిపాలయంతామ్ న్యాయ్యేన మార్గేణ మహీం
మహీశాః, సర్వే జనాః సుఖినో భవంతు. శాంతిః శాంతిః శాంతిః.

సమాప్తము.

